దశి కస్తూరీ చాథ కోలకమ్॥ ౩౯౯॥ త క్కోలకం కోశఫల

౩-కస్తూరిపేళ్లు. Musk.

కోలకమ్-తక్కోలకమ్[పా]కంకోలకమ్ [పా] కక్కోలకమ్-కోశఫలమ్॥న॥ ౩-తక్కోలపుచెట్టు పేళ్లు. దానియొక్క ఫలమనికొందఱు. Bdellium.

(మథ)కర్పూర(మస్త్రియామ్)(ఘనసారశ్చన్ద్రః) (సంజ్ఞః) స్సితాభో హిమవాలుకా ॥గన్ధసారో మలయజో భద్రశ్రీ శ్చన్దనోఽ (స్త్రియామ్)।

కర్పూరమ్॥పు॥ - ఘనసారః - చన్ద్రః - సితాభ్రః[పా]సితాభః॥పు॥- హిమవాలుకా॥స్త్రీ॥ ౫-కర్పూరముపేళ్లు. Camphor.

గన్ధసారః-మలయజః-భద్రశ్రీః॥ పు॥-చన్దనః॥ పు॥ ౪-చందనముపేళ్లు. Sandal wood.

తైలపర్ణిక గోశీర్షహరిచన్దన (మస్త్రియామ్)॥ ౩౯౧॥

తైలపర్ణికమ్॥ న॥ ౧-మిక్కిలిచల్లనైన తెల్ల చందనము, white & cool sort. గోశీర్షమ్॥ న॥ ౧-మిక్కిలి వాసనగలచందనము, very fragrant sort. హరిచన్దనమ్॥ పు॥ ౧-మామిడిపండువాసనగల పసుపువన్నె చందనము, yellow sort smelling like a ripe mango. ఈ ౩ ను పసుపువన్నె చందనము పేళ్లని కొందఱు.

తిలపర్ణీ తు పత్త్రాఙ్గం రఞ్జనం రక్తచన్దనమ్। కుచన్దనం

తిలపర్ణీ॥స్త్రీ॥ [ప] తిలపర్ణి॥న్,పు॥-పత్త్రాఙ్గమ్-రఞ్జనమ్-రక్తచన్దనమ్-కుచన్దనమ్॥ న॥ ౫-ఎఱ్ఱని చందనము పేళ్లు, Red sanders.

(చాథ) జాతికోశ జాతిఫలే (సమే)॥ ౩౯౨॥

జాతికోశమ్-జాతిఫలమ్॥ న॥ ౨-జాజికాయ పేళ్లు. Mace.

(కర్పూరాగరుకస్తూరీతక్కోలై) ర్యక్షకర్దమః।

యక్షకర్దమః॥పు॥ ౧-కర్పూరాగరుకస్తూరీతక్కోలములతోఁగూడినగంధముపేరు. Perfumed paste.

గాత్రానులేపనీ వర్తి ర్వర్ణకం (స్యా) ద్విలేపనమ్॥ ౩౯౩॥

Perfume for the person

గాత్రానులేపనీ-వర్తిః ॥ స్త్రీ ॥ ౨-సుగంధద్రవ్యములను జేర్చి మెదిపినముద్ద పేళ్లు. వర్ణకమ్-విలేపనమ్॥ న॥ ౨-మైపూఁతకై మెదపినగంధాదుల పేళ్లు. కొందఱీ నాలుగును మైపూఁతయనిరి.

చూర్ణాని వాసయోగా

చూర్ణమ్॥న॥-వాసయోగః॥పు॥ ౨-గందపొడి

గా స్సుక్ష్
ర్భావితం వాసితం (త్రి
షు) । (సంస్కారో గన్ధ
మాల్యాద్యై ర్యస్స్యా
త్త) దధివాసనమ్॥
౧౩౪॥
మాల్యం మాలా స్ర
జౌ (మూర్ధ్ని)
(కేశమధ్యేతు) గర్భ
కః ।
ప్రభ్రష్టకం (శిఖాల
మ్బి)
(పురోన్యస్తం) లలా
మకమ్॥ ౧౩౫॥
ప్రాలమ్బ(మృజులమ్బి
స్యా త్కణ్ఠాత్)
వైకక్షకం (తుతత్ ।
య త్తిర్యక్ క్షిప్తము
రసి)
(శిఖాస్వ) పీడ శేఖ
రౌ॥ ౧౩౬॥
రచనాస్యాత్పరిస్పన్ద
Decoration of hair.
ఆభోగః పరిపూర్ణ
తా । Completion.
ఉపధానం తూపబర్హః

పేళ్లు. Perfumed powder. [వృపేళ్లు.Perfumed.
భావితమ్-వాసితమ్-॥ త్రి॥ ౨-వాసనగట్టినవస్తు
అధివాసనమ్॥ న॥ ౧-గన్ధమాల్యాద్యైః=గంధమాల్యాదులచే వస్త్రాదులకు, యః సంస్కారః స్యాత్=ఏసంస్కారముగలదో, తత్=దానిపేరు. Adjusting with perfumes.
మాల్యమ్॥న॥-మాలా-స్రక్॥ జ్,సీ॥ ౩-మూర్ధ్ని=శిరస్సునందలి పువ్వులదండ పేళ్లు.A chaplet.
గర్భకః॥ పు॥ ౧ - కేశమధ్యే = వెండ్రుకలలో బయటికి తెలియసట్లు ముడిచిన పూదండ పేరు. A chaplet worn in the hair.
ప్రభ్రష్టకమ్॥న॥౧-శిఖాలమ్బి = సిగనువ్రేలెడి పూదండపేరు. Suspended from the middle lock.
లలామకమ్ ॥ న ॥ ౧-పురోన్యస్తమ్=నొసటి మీఁదఁ బడునట్లు ముందుగట్టిన పూదండపేరు. Falling over the forehead.
ప్రాలమ్బమ్॥న॥౧-కణ్ఠాత్ =మెడనుండి, ఋజులమ్బి = చక్కఁగాఁజొమ్మునవ్రేలు పూదండపేరు. Hung round the neck.
వైకక్షకమ్[పా]వైకక్ష్యకమ్॥ న॥ ౧-ఉరసి=ఱొమ్మున,తిర్యక్=జంధెమువలెనడ్డముగా,క్షిప్తం=వైచికొన్న,తత్ =ఆపూదండపేరు.Worn as a scarf.
ఆపీడః-శేఖరః॥ పు॥ ౨-శిఖాసు=శిఖమీఁదఁ జుట్టఁబడిన పూదండపేరు. Tied on the crest.
రచనా॥సీ॥-పరిస్పన్దః॥పు॥౨-మాల్యాదులచే నైన శృంగార విశేషమును బుట్టించుట పేళ్లు.
ఆభోగః॥పు॥-పరిపూర్ణతా॥సీ॥౨-(వస్తువులయొక్క గానిగుణాదులయొక్కగాని)నిండియుండుట పేరు.
ఉపధానమ్॥న॥-ఉపబర్హః॥ పు॥ ౨-తలగడ. A Pillow,

శయ్యాయాం శయనీయవత్ ॥౩౯౭॥ శయనం

శయ్యా॥స్త్రీ॥-శయనీయమ్-శయనమ్॥ న॥ ౩-పఱుపు పేళ్లు, పానుపు. A bed.

మఞ్చపర్యఙ్క పల్యఙ్కాః ఖట్వయా (సమాః)।

మఞ్చః-పర్యఙ్కః-పల్యఙ్కః॥పు॥-ఖట్వా॥స్త్రీ॥ ౪-మంచము పేళ్లు. A bedstead.

గేన్దుకః కన్దుకో

గేన్దుకః-కన్దుకః॥పు॥౨-చెండు పేళ్లు, బంతి. A ball [to play with.

దీపః ప్రదీపః

దీపః-ప్రదీపః॥పు॥౨-దీపము పేళ్లు. A lamp.

పీఠమాసనమ్॥ ౩౯౮॥

పీఠమ్-ఆసనమ్॥న॥౨-పీట పేళ్లు. A stool.

సముద్గక స్సంపుటకః

సముద్గకః - సంపుటకః॥ పు॥ ౨-కరాటము పేళ్లు. సంపుటము. A casket.

ప్రతిగ్రాహః పతద్గ్రహః।

ప్రతిగ్రాహః-పతద్గ్రహః॥పు॥౨-తమ్మపడిగము పేళ్లు. A spitting pot.

ప్రసాధనీ కఙ్కతికా

ప్రసాధనీ-కఙ్కతికా॥ స్త్రీ॥ ౨-దువ్వెన పేళ్లు. [A comb.

పిష్టాతః పటవాసకః॥ ౩౯౯॥

పిష్టాతః-పటవాసకః॥ పు॥ ౨-చీరలు వాసనకట్టు ద్రవ్యము పేళ్లు. Perfumed powder.

దర్పణే ముకురాదర్శా

దర్పణః-ముకురః [పా] మకురః-ఆదర్శః॥పు॥ ౩-అద్దము పేళ్లు. A mirror.

వ్యజనం తాలవృన్తకం।

వ్యజనమ్ తాలవృన్తకమ్॥ న॥ ౨-విసనకఱ్ఱ [పేళ్లు. A fan.

ఇతి మనుష్యవర్గః.

మనుష్యులతోఁ జేరిన పదసమూహము ముగిసెను.

సన్తతి ర్గోత్రజనన కులా న్యభిజనాన్వయౌ ॥ ౪౦౦ ॥ వంశోఽన్వవాయ స్సన్తానో

సంతతిః॥స్త్రీ॥-గోత్రమ్-జననమ్-కులమ్॥న॥-అభిజనః-అన్వయః-వంశః-అన్వవాయః-సంతానః ॥పు॥౯-వంశము పేళ్లు. Race or lineage.

వర్ణా (స్స్యు ర్బ్రాహ్మణాదయః)। [విప్రక్షత్త్రియ విట్ఛూద్రా శ్చాతుర్వర్ణ్యమితి స్మృతం]।

వర్ణః॥ పు॥ ౧ - జాతిపేరు. Tribe or class. బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యశూద్ర వర్ణములు గూడి చాతుర్వర్ణ్యమనఁబడును.

రాజబీజీ రాజవంశ్యో

రాజబీజీ॥న్॥-రాజవంశ్యః॥ పు॥ ౨-రాజవంశమున బుట్టిన వాఁడు. Sprung from a royal family.

| | |
|---|---|
| బీజ్య స్తుకులసమ్భవః॥ ౪౦౧॥ | బీజ్యః-కులసంభవః॥ పు॥ ౨-ఏదైన నొకవంశము నందుఁబుట్టినవాఁడు. Sprung from any family. |
| మహాకుల కులీనార్య సభ్య సజ్జనసాధవః। | మహాకులః- కులీనః- ఆర్యః-సభ్యః-సజ్జనః-సాధుః॥పు॥౬-మంచికులమునఁబుట్టినవాని పేళ్లు. Of honorable parentage. |
| బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో భిక్షు | బ్రహ్మచారీ॥న్॥ - గృహీ॥న్॥ - వానప్రస్థః॥-భిక్షుః॥ పు॥ ఈరను వరుసగా బ్రహ్మచారికిని (the unmarried religious student), గృహస్థునకును (the married householder), తపస్వికిని (the hermit), సన్న్యాసికిని (the ascetic) పేళ్లు. |
| (శ్చతుష్టయే)॥౪౦౨॥ ఆశ్రమోఽ(స్త్రీ) | ఆశ్రమః॥ప్న॥౧-ఇది, చతుష్టయే=బ్రహ్మచర్యము మొదలగు నాల్గింటికిని పేరు. Religious state. |
| ద్విజాత్యగ్రజన్మ భూదేవ బాడబాః। విప్రశ్చ బ్రాహ్మణోఽ | ద్విజాతిః-అగ్రజన్మా॥న్॥-భూదేవః-బాడబః॥-విప్రః-బ్రాహ్మణః॥పు॥ ౬-బ్రాహ్మణుని పేళ్లు. A man of the sacerdotal class.ద్విజః-ద్విజన్మా,అనియును. |
| (సౌ) షట్కర్మా (యాగాదిభి ర్యుతః)॥ ౪౦౩॥ | షట్కర్మా॥ న్, పు॥ ౧-యాగాదిభిః= యజన (Sacrifice), యాజన (assisting to sacrifice), అధ్యయన (study), అధ్యాపన (teaching), దాన (benefaction), ప్రతిగ్రహ (accepting alms), ములతో, యుతః=కూడిన, అసౌ=బ్రాహ్మణుని పేరు. |
| విద్వా న్విపశ్చి ద్దోషజ్ఞ స్సన్ సుధీః కోవిదో బుధః। ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాన్పణ్డితః కవిః॥ ౪౦౪॥ ధీమాన్ సూరిః కృతీ కృష్టిర్లబ్ధవర్ణో విచక్షణః। దూరదర్శీ దీర్ఘదర్శీ | విద్వాన్॥స్॥-విపశ్చిత్॥త్॥-దోషజ్ఞః - సన్॥త్॥-సుధీః-కోవిదః-బుధః -ధీరః-మనీషీ॥న్॥-జ్ఞః-ప్రాజ్ఞః-సంఖ్యావాన్॥త్॥-పణ్డితః-కవిః-ధీమాన్॥త్॥-సూరిః [వ] సూరీ ॥న్॥-కృతీ॥ న్॥-కృష్టిః-లబ్ధవర్ణః-విచక్షణః॥ పు॥ ౨౦-విద్వాంసుని పేళ్లు, Wise or learned man. దూరదర్శీ॥న్॥-దీర్ఘదర్శీ॥ న్, పు॥ ౨-దూరపు ఆలోచనగలవాని పేళ్లు, Provident. ఈ ౨౨ను విద్వాంసుని పేళ్లనియు. |
| శ్రోత్రియ శ్ఛాన్దసౌ | శ్రోత్రియః-ఛాన్దసః॥ పు॥ ౨-వేదముఁజదివిన |

| | |
|---|---|
| (సమా॥) ౭౦౫॥ | వాని పేళ్లు. A priest conversant with scripture. |
| ఉపాధ్యాయోఽధ్యాపకో ఽ | ఉపాధ్యాయః-అధ్యాపకః ॥ పు॥ ౨- వేదముఁ జదివించువాని పేళ్లు. A teacher. |
| (థస్యాన్నిషేకాదికృ) ద్గురుః। | గురుః॥పు॥౧-నిషేకాదికృత్ = గర్భాధానము పుంసవనము మొదలయిన కర్మములను చేయించు తండ్రి పేరు. A spiritual parent. |
| (మన్త్రవ్యాఖ్యాకృ) దాచార్య An instructor in holy writ. | ఆచార్యః॥పు॥ ౧ - మన్త్రవ్యాఖ్యాకృత్ = కల్పసూత్రసహితముగా వేదముఁ జదివించి దాని యర్థమును దెలియఁజెప్పువాని పేరు. |
| ఆదేష్టా (త్వధ్వరే) వ్రతీ॥ ౭౦౬॥ యష్టా చ యజమానశ్చ | ఆదేష్టా॥ఋ,పు॥౧-అధ్వరే=యజ్ఞవిషయమయిన యుపదేశముఁ జేయువాని పేరు. వ్రతీ॥న్॥-యష్టా॥ఋ॥-యజమానః॥ పు॥ ౩-యజ్ఞముఁ జేయువాని పేళ్లు. ఈ ర శబ్దములును యజ్ఞకర్త పేళ్లనికొందఱు. |
| (స సోమవతి) దీక్షితః। | దీక్షితః॥ పు॥ ౧-సోమవతి=సోమముగలయజ్ఞమునందుకర్తయైన, సః=వాని పేరు. |
| ఇజ్యాశీలో యాయజూకో | ఇజ్యాశీలః-యాయజూకః॥ పు॥ ౨-పలుమాఱు యజ్ఞము జేయుస్వభావముగలవాని పేరు. |
| యజ్వా(తు విధి నేష్టవాన్)॥ ౭౦౭॥ | యజ్వా॥న్,పు॥౧ - విధినా=యథాశాస్త్రముగా, ఇష్టవాన్=యజ్ఞము చేసినవాని పేరు, |
| (స గీష్పతీష్ట్యా) స్థపతిః | స్థపతిః॥పు॥౧-గీష్పతీష్ట్యా=బృహస్పతి పేరుగల ఇష్టిచేత యజ్ఞము చేసినవాని పేరు. |
| సోమపీథీతు సోమపః। | సోమపీథీ॥న్॥[పా]సోమపీతీ॥న్॥-సోమపః॥ పు॥ ౨-యజ్ఞము చేసి సోమపానముం జేసిన వాని పేళ్లు. |
| సర్వవేదా (స్స యేనేష్టో యాగ స్సర్వస్వదక్షిణః)॥ ౭౦౮॥ | సర్వవేదాః॥స్,పు॥ ౧ - సర్వస్వదక్షిణః=తన సొమ్మంతయు దక్షిణగాఁగల విశ్వజిత్తు మొదలయిన, యాగః=జన్నము, యేన=ఎవనిచేత, ఇష్టః=చేయఁబడినదో వాని పేరు. |
| అనూచానః (ప్రవచనే సాఙ్గేఽధీతీ గురో | అనూచానః॥పు॥ ౧- గురోః=ఒకగురువువలన, సాఙ్గేప్రవచనే= షడంగములతోఁగూడిన వేదము |

| | |
|---|---|
| స్తు యః)। | నుజెప్పఁగా, అధీతీయః=చదివినవాని పేరు. |
| (లబ్ధానుజ్ఞ) స్సమావృత్తః | సమావృత్తః॥పు॥ ౧-లబ్ధానుజ్ఞః = వేదాధ్యయనము చేసిన వెనుక గురువుచేత గృహస్థాశ్రమముకొఱకు ననుమతిఁబొందిన వాని పేరు. |
| సుత్వా (త్వభిషవే కృతే)॥ ౪౦౯॥ | సుత్వా॥ న్, పు॥ ౧ - అభిషవేకృతే=జన్నమునందలి సోమలతను కొట్టి పిడిచినవాని పేరు. |
| ఛాత్రాన్తేవాసినౌ శిష్యే | ఛాత్రః - అన్తేవాసీ॥న్॥-శిష్యః॥ పు॥ ౩ - శిష్యుని పేళ్లు. A pupil. |
| శైక్షాః ప్రాథమకల్పికాః। | శైక్షః-ప్రాథమకల్పికః॥పు॥ ౨-అపుడువచదు నారంభించిన శిష్యునిపేళ్లు. A novice in Vedas. |
| ( ఏకబ్రహ్మవ్రతాచారా మిథః) స్సబ్రహ్మచారిణః॥ ౪౧౦॥ | సబ్రహ్మచారీ॥న్,పు॥ ౧ - ఒకగురువునొద్దనొక వేదము చదువనొక వ్రతమునే యాచరించువారికి తమలోఁ దమకుపేరు. Fellow Students. |
| సతీర్థ్యా స్త్వేకగురవ Spiritual brethren. | సతీర్థ్యః-ఏకగురుః॥పు॥ ౨-ఒకగురునొద్దవేదముగాని మఱియొక విద్యగాని చదువువారిపేళ్లు. |
| (శ్చితవా నగ్ని) మగ్నిచిత్ । | అగ్నిచిత్ ॥పు॥ ౧-అగ్నిం చితవాన్ = అగ్నిచయనము చేసినవానిపేరు, ఆహితాగ్ని. On who has consecrated the sacrificial fire. |
| (పారం పర్యోపదేశే స్యా) దైతిహ్య మితిహాఽ(వ్యయమ్)౪౧౧॥ | ఐతిహ్యమ్॥న॥-ఇతిహ॥అవ్య॥ ౨-పారంపర్యోపదేశే=పారంపర్యముచేత వచ్చిన యుపదేశము పేళ్లు. Traditional instruction. |
| ఉపజ్ఞా(జ్ఞానమాద్యం స్యాత్) | ఉపజ్ఞా॥ సీ॥ ౧ - ఆద్యంజ్ఞానమ్=ఉపదేశము లేక తనంతటనే మొదటఁ బుట్టినజ్ఞానము పేరు, Untaught knowedge. |
| (జ్ఞాత్వాఽరమ్భ)ఉపక్రమః । | ఉపక్రమః॥ పు॥ ౧-జ్ఞాత్వా=ఇదియీలాగున సిద్ధించునని యుపాయము దెలిసి, ఆరమ్భః=ఆరంభించుటకుపేరు. Deliberate commencement. |
| యజ్ఞస్సవోఽధ్వరో యాగ స్సప్తతన్తు ర్మ | యజ్ఞః- సవః- అధ్వరః- యాగః-సప్తతన్తుః- మఘః [పా] మఖః - క్రతుః॥పు॥ ౭ - యజ్ఞము |

ఘః క్రతుః॥ ౪౧౨॥

(పాఠో హోమ శ్చా తిథీనాం సపర్యా తర్ప ణం బలిః। ఏతేపఞ్చ) మహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః॥ ౪౧౩॥

పేళ్లు. A sacrifice.

∴ పాఠః = వేదపాఠము, study of scipture. హోమః=వైశ్వదేవాదిహోమము, presenting of oblations to the gods. అతిథీనాం సపర్యా=అతిథిపూజ, hospitable reception of guests. తర్పణమ్=పితృతర్పణము, libation of water to the manes of ancestors. బలిః=భూతబలి, casting of food on the ground for gods or mundane beings. ఏతే = అనునివి, పఞ్చమహాయజ్ఞాః = పంచమహాయజ్ఞము లనఁబడును. (Five daily sacrifices) ఇవేవరుసగా, బ్రహ్మయజ్ఞాదినామకాః= బ్రహ్మయజ్ఞము దేవయజ్ఞము మనుష్యయజ్ఞము పితృయజ్ఞము భూతయజ్ఞమని పేళ్లుగలవి.

సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితిసంసదః। ఆస్థానీ (క్లీబ) మాస్థానం (స్త్రీనపుంసకయో) స్సదః॥ ౪౧౪॥

సమజ్యా-పరిషత్ ॥ద్॥-గోష్ఠీ - సభా - సమితిః-సంసత్ ॥ద్॥-ఆస్థానీ॥సీ॥-ఆస్థానమ్॥న॥-సదః॥న్, స్న॥ ౯-సామాన్యముగా సభపేళ్లు. ఆస్థానీ శబ్దము మొదలు 3 ను దొరలున్న సభపేళ్లని కొందఱందురు. An assembly or meeting.

ప్రాగ్వంశః (ప్రాగ్ఘవిర్గేహాత్)

A room in front of the offerings.

ప్రాగ్వంశః ॥ పు॥ ౧ - హవిర్గేహాత్ = హవిస్సులను బెట్టియున్న గృహముకంటె, ప్రాక్ = పూర్వభాగమునందు యజమానుఁడు మొదలయిన వారుండుట కొఱకునిర్మింపఁబడిన గృహముపేరు.

సదస్యా విధిదర్శినః।

సదస్యః-విధిదర్శీ॥ న్,పు॥౨ - యజ్ఞమునందు హెచ్చుతక్కువలు రాకుండ కనిపెట్టియున్న ఋత్విక్కులపేళ్లు. By-standers whose business it is to notice and correct mistakes.

సభాసద స్సభాస్తారా స్సభ్యా స్సామాజికా (శ్చ తే)॥ ౪౧౫॥

సభాసత్॥ ద్॥-సభాస్తారః - సభ్యః-సామాజికః॥ పు॥ ౪-సభయందుండువానిపేళ్లు, Member of the assembly.

| | |
|---|---|
| అధ్వర్యూద్గాతృహోతారో (యజుస్సామర్గ్విదః క్రమాత్) । | అధ్వర్యుః - ఉద్గాతా॥ఋ॥- హోతా॥ఋ, పు॥ ఈ 3 ను, క్రమాత్ = వరుసగా, యజుస్సామర్గ్విదః=యజుర్వేదమును సామవేదమును ఋగ్వేదమును నెఱిఁగినఋత్విక్కులపేళ్లు. Reciters of the prayers. |
| (ఆగ్నీధ్రాద్యా ధనైర్వార్యా) ఋత్విజో యాజకాశ్చ తే॥౭౧౬॥ | ఋత్విక్॥జ్॥-యాజకః॥పు॥౨ - ధనైః=యజ్ఞకర్తధనముచేత, వార్యాః=వరింపఁదగిన, ఆగ్నీధ్రాద్యాః = అగ్నీధ్రుఁడు మొదలయిన పదునార్వురకును పేళ్లు. Officiating priest. |
| వేదిః పరిష్కృతా భూమిః The altar. | వేదిః[సా]వేదీ॥స్త్రీ॥౧ - పరిష్కృతా=యజ్ఞముకొఱకు పరిష్కరింపఁబడిన భూమిః=భూమిపేళ్లు. |
| (సమే) స్థణ్డిలచత్వరే। | స్థణ్డిలమ్-చత్వరమ్॥న॥ ౨ - అగ్నిహోత్రమునుంచుకొఱకు సంస్కారముచేయఁబడిన స్థానముపేళ్లు. Sacrificial ground. |
| చషాలో యూపకటకః | చషాలః-యూపకటకః॥పు॥౨- యూపస్తంభమునందలి కొయ్యతోఁ జేసిన కడియముపేళ్లు. A wooden ring on the sacrificial post. |
| కుమ్బా (సుగహనా వృతిః)॥ ౭౧౭॥ | కుమ్బా॥స్త్రీ॥ ౧ - యజ్ఞశాలచుట్టుకుఁ బెట్టినమిక్కిలి గహనమయిన వెలుగుపేరు. An enclosure round the place of sacrifice. [Top of the post. |
| యూపాగ్రం తర్మ | యూపాగ్రం-తర్మ॥న్,న॥౧-యూపముకొనపేరు. |
| (నిర్మన్థ్యదారుణి) త్వరణిః (ద్వయోః)। | అరణిః॥ప్స॥ ౧-నిర్మన్థ్యదారుణి = అగ్నిని బుట్టించుటకై మథింపఁదగిన మ్రానిపేరు. wood for producing fire by attrition. |
| దక్షిణాగ్నిర్గార్హపత్యాఽహవనీయౌ (త్రయోఽగ్నయః)॥౭౧౮॥ | దక్షిణాగ్నిః-గార్హపత్యః - ఆహవనీయః॥ పు॥ ఈ 3 ను ప్రత్యేకముగాఁదమతమపేళ్లచేతఁ బ్రసిద్ధములయిన మూఁడగ్నులపేళ్లు. |
| (అగ్నిత్రయమిదం) త్రేతా | త్రేతా॥ స్త్రీ॥ ౧-ఇదమ్=ఇది,అగ్నిత్రయమ్=ఒకమాఁటచేతమూఁడగ్నులపేరు. The three sacred fires. |
| ప్రణీత (స్సంస్కృ | ప్రణీతః॥ పు॥ ౧-మంత్రముచేత సంస్కరిం |

తో౽నలః) ।

పఁబడినఅగ్ని పేరు. Fire consecrated by prayers.

సమూహ్యః పరిచాయ్యోపచాయ్యా (వగ్నౌ ప్రయోగిణః) ॥

సమూహ్యః-పరిచాయ్యః-ఉపచాయ్యః ॥పు॥ 3-యజ్ఞాగ్ని పేళ్లు. Secrificial fire.

(యో గార్హపత్యాదానీయ దక్షిణాగ్నిః ప్రణీయతే । తస్మి)న్నానాయ్యో౽

ఆనాయ్యః॥ పు॥ ౧-గార్హపత్యాత్=గార్హపత్యాగ్నినుండి, అనీయ=తెచ్చి, యః = ఏ, దక్షిణాగ్నిః=దక్షిణాగ్ని, ప్రణీయతే=ప్రణయింపఁబడునో, తస్మిన్=దాని పేరు.

థాగ్నాయీ స్వాహా చ హుతభుక్ప్రియా ॥

అగ్నాయీ - స్వాహా - హుతభుక్ప్రియా॥ స్త్రీ॥ ౩-అగ్నిహోత్రుని పెండ్లాము పేళ్లు.

(ఋక్) సామిధేనీ ధాయ్యా (చ యా స్యాదగ్నిసమిన్ధనీ) ॥ ౩_౨౧॥

సామిధేనీ-ధాయ్యా॥ స్త్రీ॥ ౨- అగ్నిసమిన్ధనీ= అగ్నిని మొదట ప్రజ్వలింపఁజేయు, ఋక్ = వేద ఋక్కు. Prayer uttered to excite fire.

(గాయత్రీప్రముఖం) ఛన్దో

ఛన్దః॥స్,న॥ ౧-గాయత్రి మొదలయిన యిరువదియాఱు ఛందస్సుల పేరు. Metre.

(హవ్యపాకే) చరుః (పుమాన్)॥ ౩_౨_౨॥

చరుః॥పు॥ ౧-హవ్యపాకే=అగ్నియందు వేల్వఁదగిన పక్వాన్నము పేరు. A prepared oblation.

ఆమిక్షా (సాశృతోష్ణే యా క్షీరే స్యాద్దధియోగతః) ।

ఆమిక్షా॥ స్త్రీ॥౧-శృతోష్ణే = కాచఁబడి వేఁడియైన, క్షీరే=పాలయందు, దధియోగతః= పెరుఁగుకూర్చుటవలననైన వికారము పేరు. A mixture of boiled and coagulated milk.

ధవిత్రం (వ్యజనం తద్యద్రచితం మృగచర్మణా) ॥ ౩_౨౩॥

ధవిత్రమ్ [పా] ధువిత్రమ్॥ న॥ ౧-యజ్ఞమునందగ్ని ప్రజ్వలనముకొఱకు, మృగచర్మణా=ఇఱ్ఱితోలుచేత, రచితమ్= చేయఁబడిన, వ్యజనమ్= విసనకఱ్ఱ పేరు. A fan made of antelope's hide.

పృషదాజ్యం (సదధ్న్యాజ్యే)

పృషదాజ్యమ్॥ న॥ ౧-సదధ్న్యాజ్యే=పెరుఁగుతోఁగూడిన నేతి పేరు. Oblation of butter and curds.

పరమాన్నం తు పాయసమ్।

పరమాన్నమ్॥న॥-పాయసమ్॥ న॥ (ప) ॥పు॥ ౨-పాలుపోసివండిన యన్నము పేళ్లు.

హవ్యకవ్యే (దైవపైత్రే అన్నే)

హవ్యమ్-కవ్యమ్॥ న॥ ౨-వరుసగా దేవతలకును పితృదేవతలకును యోగ్యమయిన అన్నము పేళ్లు. Food of the gods and manes.

పాత్రం (స్రువాదికమ్)॥ ౭౨౭॥

పాత్రమ్॥ న॥ ౧-స్రువాదికమ్ = స్రువముచమసము మొదలైనయజ్ఞపాత్రలకన్నిటికిని పేరు. A vessel.

ధ్రువోపభృజ్జుహూర్నాతు స్రువో(భేదాః స్రుచః స్త్రియః)।

ధ్రువా-ఉపభృత్-జుహూః॥ స్త్రీ॥-స్రువః॥ పు॥ ౭-స్రుచః భేదాః = స్రుక్కుభేదముల పేళ్లు.

ఉపాకృతః పశు రసౌ యోఽభిమన్త్ర్య క్రతౌ హతః)॥ ౭౨౫॥

ఉపాకృతః॥ పు॥ ౧- క్రతౌ = యజ్ఞమునందు, యః=ఏపశువు, అభిమన్త్ర్య=అభిమంత్రించి, హతః=హింసింపఁబడినదో, అసౌపశుః = ఈపశువు పేరు. A victim.

పరమ్పరాకం శమనం ప్రోక్షణం (చవధార్థకమ్)।

పరమ్పరాకమ్-శసనమ్[పా]శమనమ్- ప్రోక్షణమ్॥ న॥౩-వధార్థకమ్ = యజ్ఞమునందలి పశువధ పేళ్లు. Immolation.

(వాచ్యలిఙ్గాః) ప్రమీతోపసమ్పన్నప్రోక్షితా (హతే)॥ ౭౨౬॥

ప్రమీతః-ఉపసమ్పన్నః-ప్రోక్షితః॥ త్రి॥ ౩-హతే = యజ్ఞమున హింసింపఁబడిన పశువు మొదలైనదాని పేళ్లు. Slain or immolated.

సాన్నాయ్యం హవి

సాన్నాయ్యమ్-హవిః॥స్,న॥ ౨-అగ్నియందు వేల్వఁదగినహవిస్సు పేళ్లు. సాన్నాయ్యశబ్దము దధిపయోరూపమైన హవిస్సుపేళ్లని కొందఱు.

The thing to be offered.

(రగ్నౌతు హుతం త్రిషు) వషట్కృతమ్।

వషట్కృతమ్॥ త్రి॥ ౧-అగ్నౌ=అగ్నియందు,హుతమ్=వేల్వఁబడినహవిస్సు పేరు. Sacrificed in fire.

దీక్షాన్తోఽవభృథో (యజ్ఞే)

దీక్షాన్తః-అవభృథః॥ పు॥ ౨-యజ్ఞే=యజ్ఞాంతమునందలిన్యూనాతిరిక్తదోషపరిహారముకొఱకుఁ జేయునిష్టి పేళ్లు. Supplemental sacrifice performed to atone for any defect in the principal one.

(తత్కార్హంతు) యజ్ఞియమ్॥ (త్రిష్వ)

యజ్ఞియమ్॥ త్రి॥ ౧-తత్కార్హమ్=ఆయజ్ఞకర్మమునకుఁదగినవస్తువు పేరు. Suitable to a sacrifice.

(ఫక్రతుక) ర్మేష్టం

ఇష్టమ్॥ న॥ ౧-క్రతుకర్మ = క్రతువునందలి హోమదానాది క్రియ పేరు. Sacrificial presents.

పూర్తం (ఖాతాది కర్మ యత్)।

పూర్తమ్॥న॥౧-ఖాతాదికర్మయత్=గుంటలు గుళ్లుతోఁటలు మొదలైనవాని నిర్మించుట పేరు. An act of pious liberality.

అమృతం విఘసో(యజ్ఞశేష భోజనశేష యోః)॥ ర_౨ర॥

అమృతమ్॥న॥-విఘసః॥ పు॥ ఈ ౨-వరుసగా, యజ్ఞశేషభోజనశేషయోః= జన్నమును జేయఁగా మిగిలినయాజ్యాదులకును దేవబ్రాహ్మణులు భుజింపఁగా మిగిలిన యన్నాదులకును పేళ్లు. Remains of a sacrifice or oblation.

త్యాగో విహాపితం దానముత్సర్జన విసర్జనే। విశ్రాణనం వితరణం స్పర్శనం ప్రతిపాదనమ్॥ ప్రాదేశనం నిర్వపనమపవర్జన మంహతిః।

త్యాగః॥పు॥-విహాపితమ్ [పా] విహాయితమ్-దానమ్-ఉత్సర్జనమ్ - విసర్జనమ్-విశ్రాణనమ్ - వితరణమ్-స్పర్శనమ్-ప్రతిపాదనమ్-ప్రాదేశనమ్-నిర్వపనమ్-అపవర్జనమ్॥ న॥-అంహతిః॥ స్త్రీ॥ ౧౩-ఈవి పేళ్లు. Gift or donation.

(మృతార్థంతదహర్దానం త్రిషుస్యా) దౌర్ధ్వదైహికమ్॥ ర౩౦॥

ఔర్ధ్వదైహికమ్ [పా] ఔర్ధ్వదేహికమ్॥ త్రి॥ ౧-మృతార్థమ్=మృతులయిన వారినిగుఱించి, తదహర్దానమ్=ఆమృతిదినములయందుఁ జేయఁబడు దానము పేరు, నెలమాసికములకును పేరు. Obsequies of a deceased person.

పితృదానం నివాప (స్స్యాత్)

పితృదానమ్॥న॥-నివాపః॥పు॥ ౨-పితరలనుద్దేశించి చేయంబడు జలాంజల్యాది దానము పేరు. Gifts in honor of the deceased.

శ్రాద్ధం (తత్కర్మ శాస్త్రతః)। An obsequial oblation.

శ్రాద్ధమ్॥న॥ ౧-శాస్త్రతః=శాస్త్రోక్తమయిన దేశకాలపాత్రాది నియమము చేత, తత్కర్మ=ఆ పితృదేవతలనుగూర్చి చేయంబడు బ్రాహ్మణభోజనము మొదలయిన దాని పేరు, తద్దినము.

అన్వాహార్యం మాసికే

అన్వాహార్యమ్-మాసికమ్॥న॥౨-నెల నెలకుం జేయంబడుపిండపితృయజ్ఞము పేరు, అమావాస్య

శ్రాద్ధము. Monthly obsequies.

(ఉంశోఽష్టమోఽ హ్నః కుతపో ఽస్త్రి యామ్)॥౨౩౧॥

కుతపః[పు]కుతుపః॥ పు॥ ౧-అహ్నః=పగటియొక్క, అష్టమోంశః=ఎనిమిదవపాలు.అనఁగాపగలు ౧౫పాళ్లలో ౭పాళ్లుపోఁగా౮దవపాలనుట. Towards midday (the eighth *muhurta* of the day).

పర్యేషణా పరీష్టి శ్చాన్వేషణా చ గవేషణా।

పర్యేషణా-పరీష్టిః॥ స్త్రీ॥ ౨-శ్రాద్ధాదులయందుద్విజభక్తిశుశ్రూష, Homage. అన్వేషణా - గవేషణా॥ స్త్రీ॥ ౨-ధర్మమునరయుట, Investigation. ఈ ౪-సామాన్యముగా వెదకుటపేళ్లనియును. Search.

సని స్త్వధ్యేషణా

సనిః-అధ్యేషణా॥ స్త్రీ॥ ౨-పూజ్యుల నొకప్రయోజనమునందుసత్కారపూర్వకముగానియోగించుటపేళ్లు. Request or solicitation.

యాచ్ఞాఽభిశ స్తిర్యాచనాఽర్థనా॥ ౨౩౨॥ (షట్సు త్రి)

యాచ్ఞా-అభిశస్తిః - యాచనా - అర్థనా॥స్త్రీ॥ ౪-అడుగుటపేళ్లు. Asking or begging. ముందు చెప్పఁగల అర్ఘ్యశబ్దము మొదలు ఆగంతుశబ్దముపఱకు నాఱుశబ్దములును॥త్రి॥

ష్వర్ఘ్య (మర్ఘార్థే)

అర్ఘ్యమ్॥ త్రి॥ ౧-అర్ఘార్థే=పూజకొఱకైన జలాదులు.అర్ఘ్యోదకము. A respectful oblation of water.

పాద్యం(పాదాయవారిణి)।

పాద్యమ్॥త్రి॥౧-పాదాయ = పాదముకొఱకైన, వారిణి=ఉదకముపేరు, పాదోదకము. Water for ablution of the feet.

(క్రమా)దాతిథ్యాతిథేయే (అతిథ్యర్థేఽత్ర సాధుని)॥ ౨౩౩॥

ఆతిథ్యమ్-ఆతిథేయమ్॥ త్రి॥ ౨ - క్రమాత్ = వరుసగా, అతిథ్యర్థే=అతిథులకొఱకైన యన్నాదులకును, అత్రసాధుని = అతిథులయందుమంచిదైన భక్ష్యాదులకును పేళ్లు. Hospitality.

స్యాదావేశిక ఆగన్తు రతిథిర్నా (గృహాగతే)।

ఆవేశికః- ఆగన్తుః॥ త్రి॥-అతిథిః॥ పు॥ - గృహాగతః॥ ౪-ఇంటికివచ్చిన యతిథిపేళ్లు. A guest.

పూజా నమస్యాఽపచితిస్సపర్యాఽర్చాఽర్హణా(స్సమాః)॥౨౩౪॥

పూజా-నమస్యా-అపచితిః-సపర్యా-అర్చా-అర్హణా ॥ స్త్రీ ॥ ౬-పూజించుటపేళ్లు. Worship. Reverence.

| | |
|---|---|
| వరివస్యాతు శుశ్రూషా పరిచర్యా ప్యుపాసనమ్। | వరివస్యా-శుశ్రూషా-పరిచర్యా॥స్త్రీ॥-ఉపాసనమ్॥న॥[ప]ఉపాసనా-ఉపాస్తిః॥స్త్రీ॥౪-శుశ్రూష పేళ్లు. Service, propitiation. |
| వ్రజ్యాఽటాట్యా పర్యటనం | వ్రజ్యా-అటా-అట్యా॥ స్త్రీ॥- పర్యటనమ్॥ న॥ ౪ - భిక్షాద్యర్థమై పలుమాఱు దిరుగుట పేళ్లు. Wandering for alms. |
| చర్యా (త్వీర్యాపథస్థితిః)॥ ౪౩౧॥ | చర్యా॥స్త్రీ॥౧-ఈర్యాపథస్థితిః=ధ్యానమౌనాది వ్రతములయందుస్థిరమైయుండుట. Perseverance in austerities. |
| ఉపస్పర్శస్త్వాచమనమ్ | ఉపస్పర్శః॥పు॥-ఆచమనమ్॥న॥ ౨-శుద్ధాచమనము పేళ్లు. Rinsing the mouth. |
| (మథ) మౌన (మభాషణమ్)। | మౌనమ్-అభాషణమ్॥న॥ ౨ - మాట్లాడకుండుట పేరు. Silence, taciturnity. |
| ఆనుపూర్వీ స్త్రియాం వాఽఽవృత్పరిపాటీరనుక్రమః॥ పర్యాయ శ్చా | ఆనుపూర్వీ॥ స్త్రీ॥ - ఆవృత్ - పరిపాటిః [ప] పరిపాటీ॥స్త్రీ॥-అనుక్రమః-పర్యాయః॥పు॥ ౫-స్వాధ్యాయక్రమము పేళ్లు. Order, method. |
| తిపాత స్తు(స్యా) త్పర్యయ ఉపాత్యయః। | అతిపాతః- పర్యయః - ఉపాత్యయః ॥పు॥ ౩-క్రమముదప్పుట. Violation of the order. |
| నియమో వ్రత (మ స్త్రీ తచ్చోపవాసాది) పుణ్యకమ్॥ ౪౩౨॥ | నియమః-వ్రతమ్॥ స్త్రీ॥ ౨ - శాస్త్రోక్తనియమము పేరు, A vow. పుణ్యకమ్॥న॥౧-ఉపవాసాదిరూపమైన ఆవ్రతము పేరు. A penance. |
| ఉపవస్తం తూపవాసో | ఉపవస్తమ్[పా]ఔపవస్తమ్॥న॥- ఉపవాసః॥[ప]ఉపోషణమ్॥పు॥౨-ఉపవాసము పేళ్లు. A fast. |
| వివేకః (పృథగాత్మతా)। | వివేకః॥పు॥-పృథగాత్మతా॥స్త్రీ॥ ౨-ప్రకృతిపురుషులు వేఱని యెఱుంగుట పేరు. Discriminating between matter & spirit. True knowledge. |
| (స్యా) ద్బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధి | బ్రహ్మవర్చసమ్॥న॥-వృత్తాధ్యయనర్ధిః॥ స్త్రీ॥ ౨-మంచి నడత వేదపాఠములయు సమృద్ధి పేళ్లు. Holiness. |
| (ర్థాఞ్జలిః॥ ౪౩౩॥ | బ్రహ్మాఞ్జలిః॥పు॥ ౧-వేదపాఠసమయమునందు |

| | |
|---|---|
| పాఠే) బ్రహ్మాఞ్జలిః | ప్రణవోచ్చారణ పూర్వకమైన యంజలిపేరు. |
| (పాఠే విప్రుషో) బ్రహ్మబిన్దవః\| | బ్రహ్మబిన్దుః\|\| పు\|\| ౧ - పాఠే=వేదపాఠసమయమునందలి, విప్రుషః=నోటవెడలుతుంపరలపేళ్లు. Sanctified saliva. |
| (ధ్యానయోగాసనే) బ్రహ్మాసనం A holy posture. | బ్రహ్మాసనమ్\|\| న\|\| ౧-ధ్యానయోగాసనే=ధ్యానము చేయుటకొఱకు యోగమునందలి స్వస్తికము పద్మాసనము మొదలైన యాసనము పేరు. |
| కల్పో విధిక్రమౌ \|\| ౨౩౯\|\| | కల్పః-విధిః-క్రమః\|\|పు\|\| ౩ - ఇదియిటు చేయవలెననెడి వేదోక్తమయినవిధానము పేళ్లు. A sacred precept or rite prescribed by religion. |
| ముఖ్య (స్స్యాత్ప్రథమః కల్పో) ఽనుకల్ప (స్తు తతో ఽధమః)\| | ముఖ్యః\|\| పు\|\| ౧ - ప్రథమః = మొదటి చేయు, కల్పః=వేదవిధానము పేరు, A chief injunction. అనుకల్పః\|\| పు\|\| ౧-తతః = దానికంటె, అధమః=వెనుకఁజెప్పెడి వేదవిధానము పేరు. A secondary or succedaneous injunction. |
| (సంస్కార పూర్వం గ్రహణంస్యా) దుపాకరణం (శ్రుతేః)\|\| ౨౪౦\|\| | ఉపాకరణమ్\|\| న\|\| ౧- సంస్కారపూర్వమ్=ఉపనయనసంస్కారము మొదలుగా, శ్రుతేః గ్రహణము = వేదమును చదువఁదొడఁగొనుట పేరు. Holy study of the *Vedas* after initiation. |
| (సమేతు) పాదగ్రహణమభివాదన (మిత్యుభే)\| | పాదగ్రహణమ్-అభివాదనమ్\|\| న\|\| ౨-గోత్రనామములు చెప్పి మ్రొక్కుటపేళ్లు. A bow or prostration to a person addressed by name. |
| భిక్షుః పరివ్రాట్కర్మన్దీ పారాశర్యపి మస్కరీ\|\|౨౪౧\|\| తపస్వీ తాపసః పారికాఙ్క్షీ వాచంయమో మునిః \| | భిక్షుః- పరివ్రాట్\|\|జ్\|\|- కర్మన్దీ\|\|న్\|\| - పారాశరీ\|\|న్\|\|-మస్కరీ \|\| న్, పు\|\| ౫ - సన్న్యాసిపేళ్లు. A mendicant. తపస్వీ\|\|న్\|\|-తాపసః - పారికాఙ్క్షీ\|\| న్, పు\|\| ౩ - తపస్సుగలవాని పేళ్లు. An ascetic. వాచంయమః-మునిః\|\| పు\|\| ౨-మౌనవ్రతి పేళ్లు. A holy sage practising rigid taciturnity. ఈ ౧౦ సన్న్యాసి పేళ్లనికొందఱు. |
| (తపఃక్లేశసహో) | దాన్తః\|\|పు\|\|౧ - తపఃక్లేశసహః=తపస్సువలనఁ |

| | |
|---|---|
| దాన్తో | గలుగు శ్రమనోర్చువానిపేరు. Patient of austerity. |
| వర్ణినో బ్రహ్మచారి ణః॥ ౪౪౨॥ | వర్ణీ॥ న్॥-బ్రహ్మచారీ॥ న్, పు॥ ౨ - బ్రహ్మచారిపేళ్లు. A religious student practising austerity; an unmarried man. [లపేళ్లు. A Saint. |
| ఋషయ స్సత్యవచసః | ఋషిః[ప]రిషిః-సత్యవచాః॥స్,పు॥౨-ఋషు |
| స్నాతక స్త్వాప్లుతో (వ్రతీ) | స్నాతకః-ఆప్లుతః॥పు॥ ౨- వ్రతీ= వేదమును చదివినమీఁదనాశ్రమాంతరమును బొందక వ్రతముగలవాఁడైతీర్థస్నానశీలుఁడైయున్నబ్రహ్మచారిపేళ్లు. |
| (యే నిర్జి తే న్ద్రియ గ్రామా) యతినో యతయ (శ్చ తే)॥ ౪౪౩॥ | యతీ॥ న్॥-యతిః॥ పు॥ ౨- నిర్జితేన్ద్రియగ్రామాః = జయింపఁబడిన యింద్రియ సమూహము గలవానిపేళ్లు. A man with subdued senses. |
| (యః స్థణ్డిలే వ్రతవశా చ్ఛేతే) స్థణ్డిల శాయ్య (సౌ)॥ స్థాణ్డిల శ్చ | స్థణ్డిలశాయీ॥న్॥-స్థాణ్డిలః॥పు॥౨- వ్రతవశాత్ = వ్రతాధీనత్వమువలన, స్థణ్డిలే=నేలను,యః=ఎవఁడు, శేతే=శయనించునోవానిపేళ్లు. One who sleeps on the bare ground by way of mortification. |
| ౘ విరజ స్తమస స్స్యు ర్ద్వయాతిగాః॥ ౪౪౪॥ | విరజస్తమాః॥స్॥-ద్వయాతిగః॥పు॥౨-రజస్తమోగుణములను విడిచియున్న సాత్త్వికులపేళ్లు. Men perfectly virtuous. |
| పవిత్రః ప్రయతః పూతః | పవిత్రః - ప్రయతః-పూతః॥ పు॥ ౩-పవిత్రుఁడయినవానిపేళ్లు. Holy, pious, or sacred person. |
| పాషణ్డా స్సర్వలిఙ్గినః। Heretices. | పాషణ్డః[పా]పాఖణ్డః-సర్వలిఙ్గీ॥న్,పు॥౨-వేదబాహ్యులైన బౌద్ధకాపాలికక్షపణకాదులపేళ్లు. |
| (పాలాశో దణ్డ) ఆషాఢో (వ్రతే) | ఆషాఢః॥ పు॥ ౧-పాలాశః దణ్డః= వ్రతమునందుఁ బట్టుమోదుగుకోలపేరు. A student's staff. |
| రామ్భస్తు (వైణవః)॥ | రామ్భః॥ పు॥ ౧ - వైణవః=వెదురుకోలపేరు. |
| (అస్త్రీ)కమణ్డలుః కుణ్డీ | కమణ్డలుః॥పు॥-కుణ్డీ॥ స్త్రీ॥ ౨- కమండలువుపేళ్లు. A wooden water-pot of an ascetic. |
| (వ్రతినా మాసనం) బృసీ। | బృసీ [ప] బృషీ॥ స్త్రీ॥ ౧- వ్రతినామ్=వ్రతస్థులయొక్క, ఆసనమ్=దర్భాదులచేతఁ జేయఁబడిన యాసనముపేళ్లు. |

అజినంచర్మకృత్తిః స్త్రీ

అజినమ్-చర్మ॥న్,న॥-కృత్తిః॥స్త్రీ॥౩=చర్మము పేళ్లు. Deer skin.

భైక్షం భిక్షాకదమ్బకమ్॥ ౨౨౬॥

భైక్షమ్-భిక్షాకదమ్బకమ్॥న॥౨-బిచ్చమెత్తినపదార్థములయొక్క గుంపుపేళ్లు. Aggregate of alms.

స్వాధ్యాయః (స్వా.) జపః Reading inaudibly, or muttering prayers.

స్వాధ్యాయః-జపః [పా] జాపః॥పు॥౨-తెమ వేదమునుజపుపుటపేళ్లు. అవృత్తిచేత వేదమునుజపుపుటయని కొందఱందురు.

సుత్యాఽభిషవ స్సవనం (చసా)।

సుత్యా॥స్త్రీ॥-అభిషవః॥పు॥-సవనమ్॥న॥౩-స్నానమునకును సోమలతను దంచుటకును పేళ్లు.

(సర్వైనసామపధ్వంసి జప్యం త్రిష్వ)ఘమర్షణమ్॥ ౨౨౭॥

అఘమర్షణమ్॥త్రి॥౧ - సర్వైనసామ్=సమస్తపాపములను, అపధ్వంసి=పోఁగొట్టు, జప్యమ్=మంత్రముపేరు. An expiatory prayer.

దర్శశ్చ పౌర్ణమాసశ్చ (యాగౌ పక్షాన్తయోః పృథక్)।

దర్శః-పౌర్ణమాసః [పా] పూర్ణమాసః॥ పు॥ ఈ ౨, పక్షాన్తయోః = అమావాస్యాపౌర్ణమాసులయందుఁ జేయంబడు, పృథక్ యాగౌ = వేర్వేఱుయాగముల పేళ్లు. Half-monthly sacrifice.

(శరీరసాధనాపేక్షంనిత్యం యత్కర్మ త) ద్యమః॥ ౨౨౮॥

యమః॥పు॥ ౧- శరీరసాధనాపేక్షమ్ = శరీరమునుమాత్రము సాధనముగా నపేక్షించునదై, నిత్యంయత్కర్మ=నిత్యముగాఁ జేయఁదగిన సత్యాహింసాదికర్మముల పేరు. A perpetual duty.

నియమ (స్తుసయత్కర్మానిత్య మాగన్తుసాధనమ్)।

A voluntary duty.

నియమః॥పు॥ ౧. ఆగన్తుసాధనమ్ = శరీరముకంటె బాహ్యములయినమృజ్జలాదులను సాధనముగాఁగలిగినదై, అనిత్యంయత్కర్మ సః=సమయవిశేషములయందు కామనాదులచేత చేయఁదగిన అనిత్యమైన స్నానోపవాసజపాది కర్మములపేరు.

క్షౌరంతు భద్రాకరణం ముణ్డనంవపనం తథా॥

క్షౌరమ్-భద్రాకరణమ్-ముణ్డనమ్-వపనమ్॥న॥ ౪-క్షౌరముపేళ్లు. Shaving.

ఉపవీతం యజ్ఞసూత్రం(ప్రోద్ధృ) తే దక్షిణే

ఉపవీతమ్ ॥న॥ ౧-దక్షిణేకరే = కుడిభుజమును, ప్రోద్ధృతేసతి=తొలఁగఁబడుచుండఁగా, యజ్ఞసూ

కరే)।

త్రమ్=ఎడమ భుజముమీఁది జందెముపేరు. The secred thread passed over the left shoulder.

ప్రాచీనావీత (మన్యస్మిన్।

ప్రాచీనావీతమ్॥ న॥ ౧-అన్యస్మిన్=ఎడమ భుజము, ప్రోద్ధృతే సతి=తొలఁగఁబడుచుండఁగా, యజ్ఞసూత్రమ్ = కుడిభుజముమీఁది జందెముపేరు.

నివీతం ( కణ్ఠలమ్బితమ్)॥ ౭౫౦॥

నివీతమ్॥న॥౧-కణ్ఠలమ్బితమ్=మెడనుహారము వలెవ్రేలాడు, యజ్ఞసూత్రమ్ = జందెముపేరు.

అఙ్గుల్యగ్రే తీర్థం దైవం స్వల్పాఙ్గుల్యోర్మూలే కాయమ్।మధ్యే౽ఙ్గుష్ఠాఙ్గుల్యోః పైత్రం మూలే త్వఙ్గుష్ఠస్య బ్రాహ్మమ్॥ ౭౫౧॥

దైవంతీర్థమ్=దేవసంబంధమైన తీర్థము, అఙ్గుల్యగ్రే=వ్రేళ్లతుదయందును, కాయమ్ = ఋుషిసంబంధమైనతీర్థము, స్వల్పాఙ్గుల్యోః=చిటికెనవ్రేలు దర్భవ్రేళ్లయొక్క మూలే=మొదటను, పైత్రమ్=పితృసంబంధమయినతీర్థము, అఙ్గుష్ఠాఙ్గుల్యోః=పెనువ్రేలు జుట్టనవ్రేళ్లయొక్క, మధ్యే=నడుమను, బ్రాహ్మమ్ = బ్రహ్మ సంబంధమయినతీర్థము, అఙ్గుష్ఠస్య= పెనువ్రేలియొక్క, మూలే= మొదటనునుండును, అనఁగా నాయాప్రదేశములయందు వారి వారికిఁ దర్పణములు చేయవలయుననుట.

(స్యాద్బ్ర)హ్మభూయం బ్రహ్మత్వం బ్రహ్మసాయుజ్య(మిత్యపి।

బ్రహ్మభూయమ్ - బ్రహ్మత్వమ్ - బ్రహ్మసాయుజ్యమ్ ॥ న ॥ 3 - బ్రహ్మస్వరూప మౌట పేళ్లు. Identification with Brahma. Godhead.

దేవభూయాదికం (తద్వత్)

Becoming identified with a god.

దేవభూయాదికమ్ = దేవభూయశబ్దము మొదలయినశబ్దజాతము అనఁగా దేవభూయమ్, దేవత్వమ్, దేవసాయుజ్యమ్, అనుశబ్దములు,తద్వత్=అట్లే దేవస్వరూపమౌట. ఈ 3 ను-॥న॥.

కృచ్ఛ్రం(సాన్తపనాదికమ్)॥ ౭౫౨॥

కృచ్ఛ్రమ్॥న॥ ౧-సాన్తపనాదికమ్=సాంతపనచాంద్రాయణాదివ్రతముల పేరు. A penance.

(సన్న్యాసవత్యనశనే పుమాన్) ప్రాయో

ప్రాయః॥పు॥ ౧-సన్న్యాసవతి=సర్వసంగపరిత్యాగముతోఁ గూడుకొని, అనశనే=ప్రాణపరిత్యాగపర్యంత మాహారము లేక యుండుట పేరు, Fasting to die.

ఽథ వీరహా । నష్టాగ్నిః

వీరహా॥న్॥-నష్టాగ్నిః॥ పు॥ ౨-ఉత్సర్గేష్టిఁ జేసి గార్హపత్యాగ్నిని విడిచినవానిపేళ్లు.

కుహనా (లోభా న్మిథ్యేర్యాపథకల్పనా) ॥ ౪౫౩॥

కుహనా॥ స్త్రీ ॥ ౧-లోభాత్=ఆశవలన,మిథ్యేర్యా పథకల్పనా=అసత్యభిక్షు ధర్మమార్గమును కల్పించుకొని తిరుగుటపేరు. Hypocrisy. Practice of religious austerities through avarice.

వ్రాత్యః (సంస్కారహీన స్స్యాత్)

వ్రాత్యః॥ పు॥ ౧-సంస్కారహీనః=ఉపనయనాది సంస్కారములు లేనివానిపేరు. An uninitiated person.

దస్వాధ్యాయో నిరాకృతిః ।

అస్వాధ్యాయః-నిరాకృతిః॥పు॥ ౨-వేదము చదువనివాఁడు.One who has not duly read the *Vedas*.

ధర్మధ్వజీ లిఙ్గవృత్తి
An imposter.

ధర్మధ్వజీ॥న్॥-లిఙ్గవృత్తిః॥ పు॥ ౨-రిత్తవేషమున బ్రదుకువానిపేళ్లు. A hypocrite.

రవకీర్ణీ (క్షతవ్రతః)॥ ౪౫౪॥

అవకీర్ణీ॥ న్,పు॥-క్షతవ్రతః॥ ౨-పరస్త్రీగమనాదులచేత నష్టమయిన వ్రతముగలవాని పేరు. A violator of his vow through incontinence.

(సుప్తే యస్మి న్నస్తమేతి సుప్తే యస్మి న్నుదేతి చ । అంశుమాన్) నభినిర్ముక్తా భ్యుదితౌ (తౌ యథాక్రమమ్) ॥ ౪౫౫॥

యస్మిన్ = ఏద్విజుఁడు, సుప్తేసతి = నిద్రబోవుచుండఁగా, అంశుమాన్=సూర్యుఁడు, అస్తమ్= అస్తమయమును, ఏతి=పొందుచున్నాఁడో, యస్మిన్=ఏద్విజుఁడు,సుప్తేసతి=నిద్రబోవుచుండఁగా, ఉదేతిచ=ఉదయించుచున్నాఁడో,తౌ=ఆద్విజులిద్దఱును, యథాక్రమమ్=వరుసగా, అభినిర్ముక్తాభ్యుదితౌ=అభినిర్ముక్తుఁడనియును, One who is asleep at sun-set. అభ్యుదితుఁడనియును,—at sun-rise.

పరివేత్తాఽ (నుజోఽనూఢే జ్యేష్ఠే దారపరిగ్రహాత్) ।

జ్యేష్ఠే=అన్న, అనూఢేసతి = పెండ్లియాడక యుండఁగా, అనుజః=తమ్ముఁడు, దారపరిగ్రహాత్=తాను పెండ్లియాడుటవలన, పరివేత్తా=పరివేత్తయనఁబడును. పరివేత్తా॥ ఋ, పు॥

పరివిత్తి (స్తు తజ్జ్యాయాన్)

పరివిత్తిః॥పు॥ ౧-తజ్జ్యాయాన్=ఆపరివేత్తయొక్క యన్న పేరు. An unmarried elder brother.

వివాహోపయమౌ (సమౌ ॥ తథా) పరిణయోద్వాహోపయామాః పాణిపీడనమ్ ।

వివాహః-ఉపయమః-పరిణయః-ఉద్వాహః-ఉపయామః॥ పు॥ - పాణిపీడనమ్॥ న॥ ౬-పెండ్లి పేళ్లు. Marriage.

వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతమ్॥ ౪౫౭॥

వ్యవాయః-గ్రామ్యధర్మః॥ పు॥ - మైథునమ్-నిధువనమ్-రతమ్ [ప] సురతం॥ ౫-స్త్రీసంగము పేళ్లు. Copulation ; Sensual intercourse.

త్రివర్గో (ధర్మకామార్థైః)

త్రివర్గః॥పు॥౧-ధర్మకామార్థైః=ధర్మకామార్థములు మూఁటికి నొక పేరు. The aggregate of the three ends of human life:viz. duty,love and wealth.

శ్చతుర్వర్గ (స్సమోక్షకైః) ।

చతుర్వర్గః॥ పు॥ ౧-సమోక్షకైః=మోక్షము తోఁగూడుకొనియున్న ధర్మకామార్థములు నాల్గును. The above three with final beatitude.

(సబలైస్తై) శ్చతుర్భద్రమ్

చతుర్భద్రమ్॥న॥౧-సబలైః=బలవంతులైన, తైః=ఆ నాల్గింటికి నొక పేరు. The four ends of human life equally potent.

జన్యా (స్స్నిగ్ధా వరస్య యే)॥ ౪౫౮॥

జన్యాః॥పు॥౧-వరస్య=పెండ్లికొడుకుయొక్క, స్నిగ్ధాః=చెలికాండ్రు. The bridegroom's friends.

ఇతి బ్రహ్మవర్గః.

{ బ్రాహ్మణులతోఁజేరిన పదసమూహము ముగిసెను. }

మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్త్రియో విరాట్ ।

మూర్ధాభిషిక్తః - రాజన్యః - బాహుజః - క్షత్త్రియః [ప] క్షత్త్రః-విరాట్ ॥ జ్, పు॥ ౬-పట్టబద్ధుఁడయిన క్షత్త్రియునికిని ఆవంశమునఁ బుట్టినవారికిని పేళ్లు. A man of the military tribe.

రాజా రాట్పార్థివ క్ష్మాభృన్నృప భూప మహీక్షితః॥ ౪౫౯॥

రాజా॥న్॥-రాట్॥ జ్॥ - పార్థివః-క్ష్మాభృత్॥ త్॥-నృపః-భూపః-మహీక్షిత్॥ త్, పు॥ ౭-ప్రజలను పాలించు క్షత్త్రియునికిని ఆకార్యమును చేయు మఱియొకనికి పేళ్లు. A king, a prince.

(రాజా తు ప్రణతాశే

అధీశ్వరః॥పు॥౧-ప్రణతాశేషసామన్తః=తనకు

మసామన్త స్స్యా) దధీశ్వరః।

[ప్ర]ణమ్రుచున్న సకలసామంతులుగల, రాజాఃరాజుపేరు. సామంతులనఁగా తనదేశముచుట్టు నుండు రాజులు. An emperor paramount over all the neighbouring princes.

చక్రవర్తీ సార్వభౌమో

చక్రవర్తీ॥న్॥-సార్వభౌమః॥పు॥ ౨-సమస్త భూమినేలు రాజుపేళ్లు. A universal monarch.

(నృపోఽన్యో) మణ్డలేశ్వరః॥　　　౪౬౧॥

మణ్డలేశ్వరః॥ పు॥ ౧.- సార్వభౌమునికంటె, అన్యః=వేఱైన కొంతభూమినేలు, నృపః = రాజుపేరు. A tributary prince.

(యే నేష్టం రాజసూయేన మణ్డల స్యేశ్వర శ్చ్యయః । శాస్తి య శ్చాజ్ఞయా రాజ్ఞ స్స) సమ్రా

యేన=ఎవనిచేత, రాజసూయేన = రాజసూయమనుయాగముచేత, ఇష్టమ్=యజింపఁబడెనో, యః=ఎవ్వఁడు,మణ్డలస్య=హిమవత్సేతుమధ్యభూమికి, ఈశ్వరః=ప్రభువై యున్నాఁడో, యః=ఎవఁడు, ఆజ్ఞయా=తనయాజ్ఞచేత, రాజ్ఞః=సకలరాజులను, శాస్తి=శిక్షించుచున్నాఁడో, సః=వాఁడుము గ్గురును సమ్రాట్టులనంబడుదురు. ఈమూఁడువిధములుగల యొకఁడే సమ్రాట్టనికొందఱు. సమ్రాట్ ॥ జ్, పు॥ A paramount sovereign who has performed a *Rajasuya* sacrifice.

(డథ)రాజకమ్॥౪౬౧॥ రాజన్యకం (చ నృపతి క్షత్త్రియాణాం గణే క్రమాత్)।

రాజకమ్-రాజన్యకమ్॥ న॥ ౨-క్రమాత్ = వరుసగా, నృపతిగణే=ప్రజలనేలు రాజులసమూహమునకును, An assemblage of princes. క్షత్త్రియాణాంగణే=క్షత్త్రియజాతి వారిసమూహమునకును పేళ్లు. An assemblage of warriors.

మన్త్రీ ధీసచివో ఽమాత్యో ఽ

మన్త్రీ॥న్॥-ధీసచివః॥-అమాత్యః॥పు॥3-ఆలోచనఁజెప్పు మంత్రిపేళ్లు. A minister, a counsellor.

(న్యే)కర్మసచివా(స్తతః)॥　　　౪౬౨॥

కర్మసచివః॥పు॥ ౧-తతః=ఆమంత్రికంటె, అన్యే=వేఱైన చిల్లరపనులవారిపేరు. Other ministers.

మహామాత్రాః ప్రధానాని　　　The king's

మహామాత్రః॥పు॥- ప్రధానమ్॥ న॥ [ప] ॥పు॥ ౨ - అధికులును హీనులును గాక నడితరమైన

companions.

సేనాపతి మొదలయినవారిపేరు.

పురోధాస్తు పురోహితః।

పురోధాః॥స॥-పురోహితః॥ పు॥ ౨-పురోహితునిపేళ్లు. The priest or chaplain.

(ద్రష్టరి వ్యవహారాణాం) ప్రాడ్వివాకాక్షదర్శకౌ॥ ౪౬౩॥

ప్రాడ్వివాకః-అక్షదర్శకః॥ పు॥ ౨-వ్యవహారాణాం ద్రష్టరి = వ్యవహారములను విచారించు ధర్మాధికారిపేళ్లు. The judge.

ప్రతీహారే ద్వారపాలద్వాఃస్థ ద్వాఃస్థిత దర్శకాః।

ప్రతీహారః[ప] ప్రతిహారః-ద్వారపాలః-ద్వాఃస్థః-ద్వాఃస్థితః-దర్శకః॥ పు॥ ౫-వాకిటి కావలివానిపేళ్లు. 'ద్వాఃస్థితదర్శకః' అనియొకపేరుగాఁ గొందఱందురు. Door-keeper, porter.

రక్షివర్గస్త్వనీకస్థో

రక్షివర్గః-అనీకస్థః॥ పు॥ ౨ - అంగరక్షకుల సమూహము పేళ్లు. The royal body-guard.

ఽథాధ్యక్షాధికృతౌ (సమౌ)॥ ౪౬౪॥

అధ్యక్షః-అధికృతః॥ పు॥ ౨-ఎందు నేనియొక దానియందు నధికారముగలవానిపేళ్లు. Officer.

స్థాయుకో ఽ(ధికృతో గ్రామే)

స్థాయుకః॥పు॥౧-గ్రామే = ఒక గ్రామమునందు, అధికృతః = అధికారముగలవానిపేరు. An overseer of a village.

గోపో (గ్రామేషు భూరిషు)।

గోపః॥పు॥౧ - భూరిషు గ్రామేషు=అనేక గ్రామములయందధికారము గలవానిపేరు, The superintendant of a district.

భౌరికః (కనకాధ్యక్షో)

భౌరికః॥పు॥౧-కనకాధ్యక్షః= బంగారమునందలి యధికారముగలవానిపేరు. The treasurer.

రూప్యాధ్యక్షస్తు నైష్కికః॥ ౪౬౫॥

రూప్యాధ్యక్షః-నైష్కికః॥పు॥౨- టంకసాల యధికారిపేళ్లు. The master of the mint.

(అన్తఃపురే త్వధికృతస్స్యా) దన్తర్వంశికో (జనః)।

అన్తర్వంశికః॥పు॥౧-అన్తఃపురే= అంతఃపురమునందు,అధికృతః=అధికారియైన,జనః=జనుఁడు. The chamberlain.

సౌవిదల్లాః కఞ్చుకినః స్థాపత్యాస్సౌవిదాః (శ్చతే)॥ ౪౬౬॥

సౌవిదల్లః-కంచుకీ॥ న॥-స్థాపత్యః - సౌవిదః॥ పు॥ ౪ - అంతఃపురమునందలి కావలివానిపేళ్లు. Attendants guarding the King's harem.

| | |
|---|---|
| శణ్ఢో వర్షవర (స్తుల్యా) | శణ్ఢః [పా] షణ్ఢః - వర్షవరః॥ పు॥ - ౨-వృషణహీనులుగాని యన్యులుగాని స్త్రీస్వభావముగల వారిపేళ్లు. నపుంసకులు. A eunuch. |
| సేవకార్థ్యనుజీవినః। | సేవకః-అర్థీ॥న్॥ - అనుజీవీ॥న్,పు॥౩- సేవకుని పేళ్లు. కొలువుగాఁడు. A servant. |
| (విషయానన్తరో రాజా)శత్రుర్మిత్త్ర (మతఃపరమ్)॥౭౬౭॥ ఉదాసీనః (పరతరః) | విషయానన్తరః=తనదేశమునకంటె చేరినయావలిదేశమునందుండు, రాజా=రాజు,శత్రుః॥ పు॥= శత్రువు, అతఃపరం=ఆశత్రుదేశమునకునావలదేశమునందుండెడిరాజు,మిత్త్రమ్॥న॥=మిత్త్రుఁడు, పరతరః॥పు॥=ఆమిత్రుని దేశమునకునావలదేశమునందుండురాజు, ఉదాసీనః=ఉదాసీనుఁడు. Neutral. |
| పార్ష్ణిగ్రాహ (స్తుపృష్ఠతః)। | పార్ష్ణిగ్రాహః॥పు॥౧- ఒకదిక్కునుగెలువఁబోవు రాజునకు, పృష్ఠతః = వెనుకనుండు శత్రువుపేరు. An enemy in the rear. |
| రిపౌ వైరి సపత్నారి ద్విష ద్ద్వేషణ దుర్హృదః॥ ద్విడ్విపక్షాహితామిత్త్ర దస్యు శాత్త్రవశత్రవః। అభియాతిపరారాతి ప్రత్యర్థి పరిపన్థినః॥ | రిపుః-వైరీ॥న్॥-సపత్నః-అరిః-ద్విషత్॥ద్॥-ద్వేషణః-దుర్హృత్॥ద్॥-ద్విట్॥ష్॥-విపక్షః- అహితః-అమిత్త్రః-దస్యుః-శాత్త్రవః - శత్రుః - అభియాతిః [పా] అభిఘాతిః [ప] అభిఘాతీ॥ న్॥-పరః-అరాతిః-ప్రత్యర్థీ॥న్, పు॥-పరిపన్థీ॥ న్ ॥౧౯- శత్రువుపేళ్లు. An enemy. A hostile party. |
| స్నిగ్ధో వయస్య స్సవయా | స్నిగ్ధః-వయస్యః-సవయాః॥స్,పు॥౩- సమానవయస్సుగలచెలికానిపేళ్లు. A companion. |
| (అథ) మిత్త్రం సఖా సుహృత్। | మిత్త్రమ్॥న॥-సఖా॥ఇ,పు॥-సుహృత్॥ద్,పు॥౩- స్నేహితునిపేళ్లు. A friend, an ally. [Friendship. |
| సఖ్యం సాప్తపదీనం (స్యా) దనురోధో౽నువర్తనమ్॥ ౭౭౦॥ | సఖ్యమ్-సాప్తపదీనమ్॥ న॥ ౨- చెలిమిపేళ్లు. అనురోధః॥పు॥-అనువర్తనమ్॥న॥ ౨ - అనుకూలించుట పేళ్లు. Compliance. Serving. |
| యథార్హవర్ణః ప్రణిధి రపసర్ప శ్చరః స్ప | యథార్హవర్ణః - ప్రణిధిః - అపసర్పః-చరః-స్పశః-చారః-గూఢపురుషః॥పు॥౭ - వేగులవాని |

శః।చారశ్చ గూఢపురుష | పేళ్లు. A spy. A secret agent in a disguise. ఇందులో మొదటి ౨ ను - కృషీవలభిక్షుకాది రూపము చేతనుండు వేగులవాని పేళ్లని కొందఱు.

శ్చాప్తః ప్రత్యయిత (స్త్రిషు)॥ ౪౭౧॥ | ఆప్తః-ప్రత్యయితః॥ త్రి॥ ౨ - ఆప్తుని పేళ్లు. Trusted, confidential.

సాంవత్సరో జ్యౌతిషికో దైవజ్ఞ గణకా (వపి। స్యు) ర్మౌహూర్తిక మౌహూర్త జ్ఞాని కార్తాన్తికా (అపి)॥ ౪౭౨॥ | సాంవత్సరః-జ్యౌతిషికః-దైవజ్ఞః - గణకః - మౌహూర్తికః-మౌహూర్తః-జ్ఞానీ॥న్॥ - కార్తాన్తికః॥ పు॥ ౮-జోస్యునిపేళ్లు. An astrologer or an astronomer.

తాన్త్రికో జ్ఞాత సిద్ధాన్త | తాన్త్రికః-జ్ఞాతసిద్ధాన్తః॥పు॥౨- ఏదైననొక శాస్త్రముయొక్క తత్త్వము దెలిసినవాని పేళ్లు. A man versed in any science.

స్సత్త్రీ గృహపతి(స్సమౌ)। | సత్త్రీ॥న్॥-గృహపతిః॥పు॥ ౨-సదాదానము చేయువాని పేళ్లు. A generous house-holder.

లిపికారో ఽక్షరచణో ఽక్షరచుఞ్చుశ్చ లేఖకే॥ | లిపికారః [పా] లిపింకరః-అక్షరచణః-అక్షరచుఞ్చుః-లేఖకః॥పు॥౪-లేఖకుని పేళ్లు, లేకరి. A scribe.

లిఖితాక్షర సంస్థానే లిపిర్లిబి రుభే (స్త్రియౌ)। A writing. | లిఖితమ్ - అక్షరసంస్థానమ్-లిపిః [పా] లిపీ-లిబిః[పా]లిబీ॥స్త్రీ॥ ౨-వ్రాయఁబడిన యక్షరముల యాకారముపేళ్లు. 'అక్షరవిన్యాసే' అనెడి పాఠమునందు, లిఖితా - లిపిః-లిబిః॥స్త్రీ॥౩-వ్రాఁత పేళ్లు.

(స్యా) త్సందేశహరో దూతో | సందేశహరః-దూతః॥పు॥ ౨ - దూత పేళ్లు. A messenger, envoy.

దూత్యం (తద్భావ కర్మణీ)॥ ౪౭౪॥ | దూత్యమ్ [ప] దౌత్యమ్॥న॥౧-తద్భావకర్మణీ=ఆదూతయొక్క భావకర్మసులకుపేరు. An embasy or message.

అధ్వనీనో ఽధ్వగో ఽధ్వన్యః పాన్థః పథిక (ఇత్యపి)। | అధ్వనీనః-అధ్వగః-అధ్వన్యః-పాన్థః- పథికః॥ పు॥ ౫ - తెరువరిపేళ్లు, త్రోవనడచువాఁడు. A traveller.

(స్వా మ్యమాత్య సు | స్వామీ॥న్॥= రాజు, అమాత్యః=మంత్రి. సు

హృత్కోశ(రాష్ట్ర) దుర్గ బలానిచ)॥ ౪౭౫॥ రాజ్యాఙ్గాని (ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపిచ)॥

The requisites of regal administration.

హృత్ ॥ద్॥= చెలికాండు, కోశః=భండారము,౪ను ॥పు॥, రాష్ట్రమ్=పట్టణముతోఁ గూడిన దేశము, దుర్గమ్= పర్వతాదుల చేత పోశక్యము గాని పట్టణము, బలమ్= సేన, ౩ ను॥న॥-ఈ ౭ ను, రాజ్యాఙ్గాని=రాజ్యాంగములు. ప్రకృతయః॥స్త్రీ॥ = ఇవి ప్రకృతులని చెప్పంబడును. పౌరాణాం శ్రేణయోఽపిచ=ఒకఁడు ముఖ్యుఁడుగాఁ గలవారును సజాతీయులును నైన పురజనుల సమూహములు ప్రకృతులనంబడును.

సన్ధి(ర్నా)విగ్రహో యాన మాసనం ద్వైధమాశ్రయః॥ ౪౭౬॥ షడ్గుణాః

Six expedients in foreign politics.

సన్ధిః॥పు॥= శత్రువుతోఁ సంధిసేయఁగుట, Peace. విగ్రహః॥పు॥=కలహించుట, war. యానమ్॥న॥ దండెత్తుట, invading. ఆసనమ్॥న॥=యుద్ధమునకు సమయముఁ జూచుట, maintaining a post. ద్వైధమ్॥న॥=భేదముపుట్టించుట, a stratagem. ఆశ్రయః॥పు॥=బలవంతునిఁ జేపట్టుట, recourse to help. ఈ౬ను, షడ్గుణాః = షడ్గుణములనంబడును.

శక్తయ (స్తిస్రః ప్రభావోత్సాహ మన్త్రజాః)।

ప్రభావః= కోశదండములవలనఁ బుట్టిన తేజస్సు, majesty. ఉత్సాహః = ఎక్కువైన పరాక్రమ చేష్ట, perseverance. మన్త్రః= సంధివిగ్రహాదులనుతగినట్లు ప్రయోగించెడు నేఱుక, counsel.(వీనివలన) జాః=పుట్టిన, తిస్రః=మూఁడుబలములును, శక్తయః=శక్తులనఁబడును. అవి ప్రభుశక్తి, ఉత్సాహశక్తి, మంత్రశక్తిఅని చెప్పఁబడును. శక్తిః॥స్త్రీ॥, Power.

(క్షయః స్థానంచ వృద్ధిశ్చ) త్రివర్గో (నీతివేదినామ్)॥ ౪౭౭॥

The three states.

క్షయః॥పు॥ = శత్రువుకంటె తానుతక్కువై యుండుట, loss. స్థానమ్॥న॥=శత్రువును తానును సమముగానుండుట, equality. వృద్ధిః॥స్త్రీ॥=శత్రువుకంటె తానెక్కుడై యుండుట, success. ఈ౩ను, త్రివర్గః॥పు॥=నీతివేదులకు త్రివర్గములనంబడును.

(స) ప్రతాపః ప్రభావ(శ్చ యత్తేజః కోశద

ప్రతాపః-ప్రభావః॥పు॥_౨- కోశదణ్డజమ్ = భండారమువలనను దండువలనను పుట్టిన,యత్తే

ణ్డజమ్) ।

జః= తేజస్సుపేళ్లు. The dignity arising from treasure and forces. Majesty.

(సామ ధానే భేదదణ్డా వి) త్యుపాయ చతుష్ట యమ్)॥ ౪౭౮॥

సామ ॥న్,న॥=ప్రియముగఁ జెప్పుట, దానమ్॥ న॥=దానమిచ్చుట, bribery. భేదః॥ పు॥=కూడియున్న వారిని వేఱుపఱుచుట, దణ్డః॥ పు॥=పీడించుట, ఇతి ఉపాయ చతుష్టయమ్=ఈ౪ను ఉపాయములనఁబడును. ఉపాయః॥ పు॥, Means of success.

సాహసం తు దమో దణ్డ

సాహసమ్॥న॥-దమః-దణ్డః॥పు॥3 - దండోపాయము పేళ్లు. Subduing, punishment.

స్సామ సాన్త్వ (ముభౌ

సామ॥న్॥-సాన్త్వమ్॥న॥ ౨-సామోపాయము పేళ్లు. Conciliation. Negotiation.

సమౌ)। భేదోపజాపా

భేదః-ఉపజాపః॥పు॥ ౨-భేదోపాయము పేళ్లు. Disunion, sowing of dissention.

వుపధా (ధర్మాద్యై ర్యత్పరీక్షణమ్)॥౪౭౯॥

ఉపధా॥స్త్రీ॥ ౧-ధర్మాద్యైః=ధర్మార్థకామములచేత మంత్రులు మొదలైనవారిని, యత్ పరీక్షణమ్=పరీక్షించుట పేరు. Trial or test of honesty.

(పఞ్చ త్రి)

పఞ్చ=ఈముందు చెప్పఁబడు 'అపడక్షీణ వివిక్త విజన చ్ఛన్న నిశ్శలాక' శబ్దములైదును॥త్రి॥

ష్వపడక్షీణో(యస్తృ తీయా ద్యగోచరః)।

అపడక్షీణః॥ త్రి॥ ౧ - తృతీయాద్యగోచరః=మూఁడవవాఁడు మొదలైనవారికి తెలియనట్టుగా నిద్దరాడుకొను, యః = ఏకాంత మేది గలదో దాని పేరు. Secret unknown to a third person.

వివిక్తవిజన చ్ఛన్న ని శ్శలాకాస్తథా రహః॥ ర హశ్చోపాంశు (చాలిఙ్గే

వివిక్తః-విజనః-ఛన్నః-నిశ్శలాకః॥త్రి॥-రహః॥స్, న॥-రహస్-ఉపాంశు॥ అవ్య॥ ౭-ఏకాంతమునకుఁదగిన స్థలము పేళ్లు. Solitude.

రహస్యం (తద్భవే త్రిషు)।

రహస్యమ్॥త్రి॥ ౧-తద్భవే=ఆయేకాంత స్థలమునందుఁబుట్టిన దాని పేరు.Occurring in private.

(సమౌ) విస్రమ్భవి శ్వాసౌ

విస్రమ్భః [పా] విశ్రంభః-విశ్వాసః॥పు॥ ౨-విశ్వాసము పేళ్లు, నమ్మిక. Trust, confidence.

భ్రేషో (భ్రంశో య

భ్రేషః॥పు॥౧-యథోచితాత్ = తనకుచితమైన

ష్టోచితాత్)॥ ౪౯౧॥ | ధర్మమువలన భ్రంశః=చలించుటపేరు. Falling from rectitude; betraying.

అభ్రేష న్యాయ కల్పాస్తు దేశరూపం సమఞ్జసమ్। | అభ్రేషః-న్యాయః-కల్పః॥పు॥-దేశరూపమ్-సమఞ్జసమ్॥న॥ ౫-తనకుచితమైన ధర్మమువలనఁ జలింపక యుండుట పేళ్లు. Propriety, fitness.

యుక్త మౌపయికం లభ్యం భజమానాభినీత (వత్)॥౪౯౨॥ న్యాయ్యం (చ త్రిషువట్) | యుక్తమ్-ఔపయికమ్-లభ్యమ్-భజమానమ్-అభినీతమ్-న్యాయ్యమ్॥త్రి॥ ౬-న్యాయముతోఁ గూడినదాని పేళ్లు. Right, fit or proper.

సంప్రధారణా తు సమర్థనమ్। | సంప్రధారణా॥స్త్రీ॥-సమర్థనమ్॥న॥ ౨-యుక్తాయుక్తములయందు నిదియుక్తమనిసమర్థించుట పేరు. Deliberation on the propriety or impropriety of any thing: a determination thereon.

అపవాద స్తు నిర్దేశో నిదేశ శ్శాసనం చ సః॥ ౪౯౩॥ శిష్టి శ్చాజ్ఞా చ | అపవాదః-నిర్దేశః-నిదేశః॥పు॥-శాసనమ్॥న॥-శిష్టిః-ఆజ్ఞా॥స్త్రీ॥౬-ఆజ్ఞ. An order or command.

సంస్థాతు మర్యాదా ధారణా స్థితిః। | సంస్థా-మర్యాదా-ధారణా-స్థితిః॥స్త్రీ॥౪-మర్యాద పేళ్లు. మేరదప్పకయుండుట. Continuance in the right path.

ఆగో ఽపరాధో మన్తుశ్చ | ఆగః॥స్,న॥అపరాధః-మన్తుః॥ పు॥ ౩-అపరాధము పేళ్లు. Offence, fault, transgression.

(సమేతూ)ద్దాన బన్ధనే॥ | ఉద్దానమ్-బన్ధనమ్॥న॥ ౨-కట్టివేయుట. Binding.

ద్విపాద్యో (ద్విగుణో దణ్డో) | ద్విపాద్యః॥ పు॥ ౧-ద్విగుణః=రెట్టింపగు,దణ్డః=దండుగగొనుట పేరు. Double penalty.

భాగధేయః కరో బలిః॥ | భాగధేయః-కరః-బలిః॥పు॥౩-రాజునకు నీఁదగిన యప్పనము పేళ్లు. Rents, tax, tribute.

(ఘట్టాదిదేయం) శుల్కోఽ౽స్త్రీ) | శుల్కః॥ప్స॥౧-ఘట్టాదిదేయమ్=సుంకపుచావిడి మొదలైనచోట్ల రాజునకీఁదగిన ద్రవ్యము.Toll.

ప్రాభృతం తు ప్రదేశనమ్॥ ౪౯౫॥ | ప్రాభృతమ్-ప్రదేశనమ్॥న॥ ౨-దేవతలకును, మిత్రులు మొదలగువారికినివ్వఁబడు కానుక పేరు.

| | An oblation, or a present. |
|---|---|
| ఉపాయన ముపగ్రా హ్య ముపహార (స్త్రో) పదా । | ఉపాయనమ్-ఉపగ్రాహ్యమ్॥న॥-ఉపహారః॥పు॥-ఉపదా॥ సీ॥ ౪-రాజదర్శనార్థమై తెచ్చు కానుక పేళ్లు. An humble offering to a king. |
| యౌతకా (దితు య ద్దేయం)సుదాయో హ రణం(చతత్)॥౨౮॥ | యౌతకమ్॥న॥-సుదాయః॥పు॥-హరణమ్॥న॥ ౩-యత్=ఏది, దేయమ్=వివాహమునందల్లునికిని ఆఁడుబిడ్డకును నీఁదగినదో ఆవస్తువుల పేళ్లు. A nuptial present. A special present. |
| తత్కాలస్తు తదా త్వం (స్యా) | తత్కాలః పు॥-తదాత్వమ్॥న॥ ౨-వర్తమానకాలము పేళ్లు. Present time. |
| (దుత్తరః కాల) ఆ యతిః । | ఆయతిః॥ సీ॥ ౧-ఉత్తరః కాలః=రాఁగలకాలము పేరు. Future time. |
| సాందృష్టికం (ఫలం సద్య) | సాందృష్టికమ్॥న॥ ౧-సద్యః ఫలమ్=తత్కాలము నందుఁగలుగు ఫలము. Immediate consequence. |
| ఉదర్కః (ఫలము త్తరమ్)॥ ౨౯॥ | ఉదర్కః॥ పు॥ ౧-ఉత్తరం ఫలమ్ = ముందు రాఁగల ఫలముపేరు. Future consequence. |
| అదృష్టం (వహ్ని తో యాది) | అదృష్టమ్॥ న॥ ౧-వహ్నితోయాది=అగ్ని జలము మొదలైనవానివలనఁబుట్టిన భయముపేరు. Casual and unseen danger. |
| దృష్టం (స్వపరచక్ర జమ్) । Obvious danger. | దృష్టమ్॥ న॥ ౧-స్వపరచక్రజమ్=తనవారివలనను పగవారివలనను బుట్టిన భయము పేరు. "దృష్టంత్వపరచక్రజమ్" అనియుపాఠముగలదు. |
| (మహీభుజా)మహీభ యం (స్వపక్షప్రభవం భయమ్)॥ ౩౦॥ | మహీభయమ్॥న॥౧-మహీభుజామ్=రాజులకు, స్వపక్షప్రభవమ్=మూలబలము మొదలుగా నేడు విధములైన స్వపక్షములవలనఁబుట్టిన,భయమ్= భయము. Latent danger from one's own party. |
| ప్రక్రియా త్వధికార | ప్రక్రియా॥ సీ॥-అధికారః॥పు॥ ౨-అధికారము పేళ్లు. Bearing of royal insignia. |
| (స్స్య)చ్చామరంతు ప్రకీర్ణకమ్ । | చామరమ్-ప్రకీర్ణకమ్॥న॥ ౨-వింజామర పేళ్లు.The bushy tail of the Bos grunniens used as a fan. |

నృపాసనం (తు యు)ద్భద్రాసనం

నృపాసనమ్ - భద్రాసనమ్॥ న॥ ౨-రాజులు కూర్చుండు నాసనముపేళ్లు. A throne.

సింహాసనం(తుతత్)॥ ౭౯౬॥ (హైమం)

సింహాసనమ్॥ న॥ ౧-హైమమ్=బంగారుతోఁ జేయఁబడిన, తత్=ఆరాజుకూర్చుండు నాసనము పేరు. A throne made of gold. [A parasol.

ఛత్త్రంత్వాతపత్త్రం (రాజ్ఞస్తు) నృపలక్ష్మ (తత్)।

ఛత్త్రమ్-ఆతపత్త్రమ్॥ న॥ ౨-గొడుగుపేళ్లు. నృపలక్ష్మ॥న్,న॥ ౧-రాజ్ఞః=రాజునకుపట్టెడు, తత్=ఆగొడుగుపేరు. A royal parasol.

భద్రకుమ్భః పూర్ణకుమ్భః

భద్రకుమ్భః-పూర్ణకుమ్భః॥పు॥ ౨-రాజద్వారాదులయందుఁ బెట్టఁబడిన పూర్ణకలశముపేరు. A golden jar filled with holy water.

భృఙ్గారః కనకాలుకా॥ ౭౯౭॥

భృఙ్గారః॥ పు॥-కనకాలుకా॥స్త్రీ॥ ౨- బంగారు గిండిపేళ్లు. A golden vase.

నివేశః శ్శిబిరం (షణ్డే)

నివేశః॥పు॥-శిబిరమ్॥న॥ ౨-దండుదిగియున్న తావు. దండువిడిసినపాళెము. A camp.

సజ్జనం తూపరక్షణమ్।

A Sentry; an out-post.

సజ్జనమ్-ఉపరక్షణమ్॥న॥ ౨ - దండుకావలి కొఱకు చుట్టుఁబెట్టిన వెలుగు మొదలైనదానిపేళ్లు.

(హస్త్యశ్వ రథ పాదాతం) సేనాఙ్గం (స్యా చ్చతుష్టయమ్)॥ ౭౯౮॥

సేనాఙ్గమ్॥ న॥ ౧-హస్త్యశ్వరథపాదాతమ్= ఏనుఁగులు గుఱ్ఱములు రథములు కాలుబలము ననెడి, చతుష్టయమ్=ఈనాల్గు, సేనాంగములనఁ బడును. A component part of an army.

దన్తీదన్తావలో హస్తీ ద్విరదో ఽనేకపో ద్విపః। మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ॥ ఇభః స్తమ్బేరమః పద్మీ

దన్తీ॥న్॥-దన్తావలః-హస్తీ॥న్॥-ద్విరదః- అనేకపః - ద్విపః - మతఙ్గజః-గజః - నాగః - కుఞ్జరః- వారణః-కరీ॥న్॥-ఇభః- స్తమ్బేరమః-పద్మీ॥న్,పు॥ ౧౫-ఏనుఁగుపేళ్లు. An elephant.

యూథనాథ స్తుయూథపః।

యూథనాథః-యూథపః॥పు॥ ౨ - ఏనుఁగుల గుంపులో ముఖ్యమయిన యేనుఁగుపేళ్లు. The leader of a wild herd of elephants.

మదోత్కటో మదకల

మదోత్కటః-మదకలః॥పు॥ ౨-మదముపట్టిన

| | |
|---|---|
| లః | యేనుఁగుపేళ్లు. A rutting elephant. |
| కలభః కరిశాబకః॥ ౪౯-౩॥ | కలభః-కరిశాబకః [పా] కరిపోతకః॥పు॥౨-ఏనుఁగుగున్న పేళ్లు. A young elephant. |
| ప్రభిన్నో గర్జితో మత్త | ప్రభిన్నః-గర్జితః-మత్తః॥పు॥౩-మదముగాఱు నేనుఁగుపేళ్లు. A furious elephant in rut. |
| స్సమా వుద్వాన్త నిర్మదౌ । | ఉద్వాన్తః-నిర్మదః॥పు॥ ౨ - మదమువిడిచిన యేనుఁగుపేళ్లు. An elephant out of rut. |
| హాస్తికంగజతాబృన్దే | హాస్తికమ్॥న॥-గజతా॥స్త్రీ॥౨- బృన్దే = ఏనుఁగులగుంపుపేళ్లు. A herd of elephants. |
| కరిణీ ధేనుకా వశా॥ | కరిణీ-ధేనుకా-వశా॥స్త్రీ॥౩-ఆఁడుఏనుఁగుపేళ్లు. A she-elephant. |
| గణ్డః కటో | గణ్డః-కటః॥పు॥ ౨-ఏనుఁగుచెక్కిలిపేళ్లు. An elephant's temple. |
| మదో దానం | మదః॥పు॥-దానమ్॥న॥౨-మదముపేళ్లు. Rut. |
| వమథుః కరశీకరః । | వమథుః-కరశీకరః॥పు॥ ౨-తొండమువలనఁ బుట్టిన తుంపరపేరు. Water emitted from the elephant's trunk. |
| కుమ్భౌ(తు) శిరసః పిణ్డౌ | కుమ్భౌ॥పు॥౧-శిరసః పిణ్డౌ=ఏనుఁగుశిరస్సుమీఁదనుండు మాంసఖండములు, కుంభస్థలము. The frontal globes on the forehead of an elephant. |
| (తయోర్మధ్యే) విదుః (పుమాన్) ॥ ౪౯-౫ ॥ | విదుః॥పు॥౧-తయోః = ఆకుంభస్థలములయొక్క,మధ్యే=నడుము. The hollow between them. |
| అవగ్రహో (లలాటం స్యాత్) | అవగ్రహః॥పు॥౧ - లలాటమ్=ఏనుఁగునొసటి పేరు. Elephant's forehead. |
| ఈషికా (త్వక్షికూటకమ్) । | ఈషికా[పా]ఇషీకా॥స్త్రీ॥౧ - అక్షికూటకమ్= ఏనుఁగుకనుగ్రుడ్డుపేరు. Elephant's eyeball. |
| (అపాఙ్గదేశో)నిర్యాణం | నిర్యాణమ్॥న॥౧-అపాఙ్గదేశః = ఏనుఁగుకడ కన్ను పేరు. Corner of his eye. |
| (కర్ణమూలంతు)చూలికా॥ ౪౯-౬॥ | చూలికా॥స్త్రీ॥౧-కర్ణమూలమ్ = ఏనుఁగుచెవి మొదటిపేరు. Root of his ear. |
| (అధః కుమ్భస్య) వా | వాహిత్థమ్॥న॥౧- కుమ్భస్య = ఏనుఁగుకుంభ |

హిత్థం

స్థలమునకు, అధః = దిగువనున్న ప్రదేశము పేరు. Part below the frontal globes.

ప్రతిమాన (మధోఽస్య యత్) ।

ప్రతిమానమ్॥న॥౧-అస్య = ఈ వాహిత్థమునకు, అధః=దిగువనున్న, యత్ =ప్రదేశము పేరు. Part between the tusks.

ఆసనం (స్కన్ధదేశ స్త్వస్య)

ఆసనమ్॥ న ॥౧-స్కన్ధదేశః=ఏనుఁగుయొక్క మూఁపు పేరు. Elephant's withers.

పద్మకం (బిన్దుజాలకమ్)॥ ౪౯-౭॥

పద్మకమ్॥న॥౧-బిన్దుజాలకమ్ = ఏనుఁగునకు యౌవనమున దేహములోఁ బుట్టిన బొట్లపేరు. ఏనుఁగుసిబ్బెము. Marks on his body.

పక్షభాగః (పార్శ్వభాగో)

పక్షభాగః॥పు॥౧ - పార్శ్వభాగః = ఏనుఁగుయొక్క యుభయపార్శ్వముల పేరు. His flank.

దన్తభాగ (స్తు యోఽగ్రతః) ।

దన్తభాగః॥పు॥౧-అగ్రతఃయః = ఏనుఁగుయొక్క ముందుభాగము పేరు. His front.

(ద్వావపూర్వపశ్చాజ్జఙ్ఘాదిదేశౌ) గాత్రావరే (క్రమాత్)॥ ౪౯-౮॥

పూర్వపశ్చాజ్జఙ్ఘాదిదేశౌ=ముందఱను వెనుకనున్న మోఁకాళ్ల క్రింది ప్రదేశములు రెంటను, క్రమాత్ =వరుసగా, గాత్రావరే=గాత్రమ్(Shoulder) అవరమ్[పా]అపరమ్(Thigh) అని చెప్పఁబడును.

తోత్త్రం వైణుక

తోత్త్రమ్-వైణుకమ్ [పా] వేణుకమ్॥న॥౨-ఏనుఁగును శిక్షించుకోల పేళ్లు, అంకుశము. A pike to drive an elephant.

మాలానం బన్ధస్తమ్భేఽథ

ఆలానమ్॥న॥-బన్ధస్తమ్భః॥పు॥౨-ఏనుఁగును కట్టు స్తంభము. Post to which he is tied.

శృఙ్ఖలే । అన్దుకో నిగలోఽ (స్త్రీ స్యా)

శృఙ్ఖలమ్॥త్రి॥-అన్దుకః॥పు॥- నిగలః [పా] నిగడః॥పు॥౩-ఏనుఁగునుగట్టు గొలుసుపేళ్లు. Chains.

దఙ్కుశోఽ(స్త్రీ) సృణిః (స్త్రియామ్)॥

అఙ్కుశః॥పు॥-సృణిః॥స్త్రీ॥ ౨-అంకుశము పేళ్లు. The goad of an elephant.

దూష్యా కక్ష్యా వరత్రా (Leathern girt.)

దూష్యా[పా]చూషా-కక్ష్యా [ప] కక్షా-వరత్రా॥స్త్రీ॥౩ - ఏనుఁగునడుమునఁగట్టుతోలుమోకు.

స్యాత్కల్పనా సజ్జ

కల్పనా-సజ్జనా॥ స్త్రీ ॥ ౨-ఏనుఁగును శృంగా

నా (సమే) ।

రించుటపేళ్లు. Equipping an elephant.

ప్రవేణ్యాస్తరణం వర్ణః పరిస్తోమః కుథో (ద్వయోః) ॥ ౫౦౦॥

ప్రవేణీ॥సీ॥-ఆస్తరణమ్॥న॥-వర్ణః-పరిస్తోమః॥పు॥-కుథః॥పు॥ [ప] ॥త్రి॥౫-ఏనుఁగుమీఁదఁబఱచు రత్నకంబళిపేళ్లు. His trappings.

వీతం (త్వసారం హాస్త్యశ్వం)

వీతమ్॥న॥౧-అసారమ్=బలములేని, హాస్త్యశ్వమ్=ఏనుఁగునకును గుఱ్ఱమునకునుపేరు. An elephant or horse unfit for riding.

వారీ తు గజబన్ధనీ ।
An elephant-stable.

వారీ॥సీ॥-గజబన్ధనీ॥౨-ఏనుఁగును పట్టుటకొఱకుఁ జేయఁబడిన యోఁదము లేక గజశాలకుపేళ్లు. A hole or trap for catching elephants.

ఘోటకే వీతి తురగ తురఙ్గాశ్వతురఙ్గమాః॥ వాజివాహార్వగన్ధర్వ హయసైన్ధవసప్తయః।

ఘోటకః[ప]ఘూటః-వీతిః[పా]పీతిః[ప] పీతీ॥న్॥-తురగః-తురఙ్గః-అశ్వః-తురఙ్గమః-వాజీ॥న్॥-వాహః-అర్వా॥న్॥[ప]అర్వన్॥త్॥-గన్ధర్వః-హయః-సైన్ధవః-సప్తిః॥పు॥౧౩-గుఱ్ఱముపేళ్లు. A horse.

ఆజానేయాః కులీనా

ఆజానేయః॥పు॥ ౧-కులీనాః=మంచిజాతిగుఱ్ఱములపేరు. Horses of a good breed.

(స్స్యు)ర్వినీతా (స్సాధువాహినః)॥ ౫౦౨॥

వినీతాః॥పు॥౧-సాధువాహినః=లెస్సగమోయనేర్చినగుఱ్ఱములు. Horses trained for the manege.

వనాయుజాః పారసీకాః కామ్బోజా బాహ్లికా (హయాః)।

వనాయుజః [ప] వానాయుజః-పారసీకః-కామ్బోజః-బాహ్లికః॥పు॥ఈరనువరుసగా వానాయుజము,పారసీకము,కాంబోజము,బాహ్లికము-అను నాల్గుదేశములలోఁబుట్టిన,హయాః=గుఱ్ఱములు.

యయు (రశ్వోఽశ్వమేధీయో)

యయుః॥పు॥౧-అశ్వమేధీయః=అశ్వమేధయాగమునకుఁదగిన,అశ్వః=గుఱ్ఱమునకుపేరు. A horse fit for sacrifice.

జవన (స్తుజవాధికః॥) ౫౦౩॥

జవనః॥పు॥౧ - జవాధికః = వేగముచేతనధికమైనగుఱ్ఱముపేరు. A fleet horse. A courser.

పృష్ఠ్యః స్థౌరీ

పృష్ఠ్యః-స్థౌరీ॥న్॥[పా] స్థోరీ॥న్, పు॥ ౨-మోఁపుమోయుగుఱ్ఱముపేళ్లు. A pack horse.

(సితః) కర్కో-

కర్కః॥పు॥౧-సితః=తెల్లనిగుఱ్ఱము. A white horse.

| | |
|---|---|
| రథ్యో(వ్రోఢారథస్య యః) । | రథ్యః॥పు॥౧-రథస్య వ్రోఢాయః = రథమును వహించు గుఱ్ఱముపేరు. A chariot-horse. |
| (బాలకి) కిశోరో | కిశోరః॥పు॥౧-బాలః=గుఱ్ఱపుపిల్ల పేరు. A colt. |
| వామ్యశ్వా బడబా | వామీ - అశ్వా-బడబా॥సీ॥౩-గోడిగపేళ్లు. ఆఁడుగుఱ్ఱము. A mare. |
| బాడబం(గణే)॥౫౦౪॥ | బాడబమ్॥న॥౧-గణే = గోడిగలగుంపు. A stud. |
| (త్రిష్వా) శ్వీనం యద శ్వేన దివసేనై కేన గమ్యతే)। | అశ్వేన=గుఱ్ఱము చేత,ఏకేనదివసేన=ఒకదినము చేత,యత్=ఏత్రోవ,గమ్యతే=పొందఁబడుచున్నదో, తత్=ఆత్రోవ, ఆశ్వీనమ్॥త్రి॥=ఆశ్వీనమనం బడును. A day's journey for a horse. |
| కశ్యం (తు మధ్య మశ్వానాం। | కశ్యమ్॥న॥౧- అశ్వానామ్ = గుఱ్ఱములయొక్క,మధ్యమ్=నడుము పేరు. A horse's flank. |
| హేషా హ్రేషా ( చ నిస్వనః)॥ ౫౦౫॥ | హేషా-హ్రేషా॥ సీ॥ ౨-నిస్వనః=గుఱ్ఱములు సకిలించుటపేళ్లు. గుఱ్ఱముల ధ్వని. Neighing. |
| నిగాలస్తు గలోద్దేశే) | నిగాలః॥ పు॥ ౧-గలోద్దేశే=గుఱ్ఱపు మెడదగ్గఱి చోటు. అచట దేవమణియుండును. His throat. |
| (బృన్దే త్వశ్వీయ మాశ్వ (వత్)। | అశ్వీయమ్-ఆశ్వమ్॥ న॥ ౨-బృన్దే=గుఱ్ఱముల గుంపుపేళ్లు. A multitude of horses. |
| ఆస్కన్దితంధౌరితకం రేచితంవల్గితం ప్లుతమ్॥ ౫౦౬ ॥ (గత యోఽమూః పఞ్చధారాః) | ఆస్కన్దితమ్॥న॥=సమమైననడపు, walk. ధౌరితకమ్॥ న॥ = అధికమై చతురమైన నడపు, trot. రేచితమ్॥న॥=తాళగతితో పేరెముగాఁ దిరుగుట, Sidling. వల్గితమ్॥ న॥ = వేగము చేత నిలువఁబడి మీఁదికి కాళ్లు కదలించుట, gallop. ప్లుతమ్॥ న॥=వేగము చేత నంతమేరయును సమముగా బోవుట, Vaulting. ఈ౫ను, ధారాః॥సీ॥=గుఱ్ఱపు గతి విశేషములు. Paces of a horse. |
| ఘోణాతు ప్రోథ (మస్త్రియామ్)। | ఘోణా - ప్రోథమ్। స్న॥ ౨-గుఱ్ఱపుముక్కుపేళ్లు. The nostrils of a horse. |
| కవికాతు ఖలీనో | కవికా॥సీ॥-ఖలీనః[పు]ఖలీనమ్॥ స్న॥ ౨-కళ్లెము |

| | |
|---|---|
| | పేళ్లు. The bit of a bridle. |
| (ఉ స్త్రీ) శఫం (క్లీబే) ఖురః(పుమాన్)॥ | శఫమ్॥ న॥-ఖురః॥ పు॥ ౨-గొరిసెల పేళ్లు. A horse's hoof. |
| పుచ్ఛో (ఉ స్త్రీ) లూమలాఙ్గూలే వాలహస్త శ్చ(వాలధిః)। | పుచ్ఛః॥ప్న॥-లూమ॥న్॥ [ప] లూమమ్-లాఙ్గూలమ్॥ న॥ 3-గుఱ్ఱము మొదలయినవానితోఁక పేళ్లు. Tail. వాలహస్తః-వాలధిః॥ పు॥ ౨-కేశయుక్తమైనతోఁక పేళ్లు. A bushy tail. |
| (త్రిషూ)పావృత్తలుఠితౌ పరావృత్తేముహుర్భువి॥ ౫౦౮ | ఉపావృత్తః-లుఠితః॥ త్రి॥ ౨-భువి=భూమియందు, ముహుః=పలుమాఱును, పరావృత్తే=పొర్లాడిన గుఱ్ఱము పేళ్లు. A horse rolling himself. |
| (యానేచక్రిణి యుద్ధార్థే) శతాఙ్గ స్స్యన్దనో రథః। | శతాఙ్గః - స్యన్దనః - రథః॥పు॥3- యుద్ధార్థే=యుద్ధముకొఱకైన, చక్రిణి=బండికండ్లతోఁగూడిన, యానే=వాహనము. రథము. A war-chariot. |
| (అసౌ) పుష్యరథ(శ్చక్రయానం న సమరాయ యత్)॥ ౫౦౯॥ | పుష్యరథః[పా]పుష్పరథః॥పు॥౧-యచ్చక్రయానమ్=ఏరథము, సమరాయ=యుద్ధముకొఱకు, న=కాదో, అసౌ=ఇది. A car for travelling or for pleasure. |
| కర్ణీరథః ప్రవహణండయనం (చ సమం త్రయమ్)। | కర్ణీరథః॥పు॥- ప్రవహణమ్-డయనమ్॥ న॥ 3-మనుష్యులు మోయు విమానమను రథము పేళ్లు. A covered litter for women. |
| (క్లీబే)ఽన శ్శకటోఽ(స్త్రీస్యా)ద్గన్త్రీకమ్బలివాహ్యకమ్॥ ౫౧౦॥ | అనః॥స్,న॥-శకటః॥ప్న॥ ౨-బండిపేళ్లు. A cart. గన్త్రీ॥సీ॥-కమ్బలివాహ్యకమ్॥న॥౨-దిడ్డిన యెద్దులుదీయుబండిపేళ్లు. A carriage drawn by oxen. |
| శిబికా యాప్యయానం (స్యాత్) | శిబికా॥సీ॥-యాప్యయానమ్॥ న॥ ౨-అందలము పేళ్లు. పల్లకియు. A palanquin. |
| దోలా ప్రేఙ్ఖాఽదికా (స్త్రియాం)। | దోలా-ప్రేఙ్ఖా॥సీ॥ ౨ - ఉయ్యాలపేళ్లు. ఆదిశబ్దము చేమంచాదులకును డోలయను పేరుకలదు. A hammock or swing. |
| (ఉభౌ తు)ద్వైపవైయాఘ్రౌ (ద్వీపిచర్మా | ద్వైపః-వైయాఘ్రః॥ త్రి॥ ౨-ద్వీపిచర్మావృతే=పులితోలు చేత కప్పఁబడిన, రథే=రథము పేళ్లు. |

| | |
|---|---|
| (జ్యేష్ఠం) త్రిహాయణీ। | త్రిహాయణీ॥ సీ॥ ౧-మూడేండ్లవయసుగలయావు.—three years old. |
| వశా వన్ధ్యా౨ | వశా - వన్ధ్యా॥ సీ॥౨ - గొడ్డుటావు పేళ్లు. A barren cow. |
| వశోకా తు స్రవద్గర్భా౨ | అవతోకా-స్రవద్గర్భా॥సీ॥ ౨-దైవికమున నీచుకొనిపోయిన యావు. A cow miscarrying by accident. |
| థ సన్ధినీ॥ ౨౪౬॥ (ఆక్రాన్తా వృషభేణ) | సన్ధినీ॥సీ॥౧-(వెదగాని)వృషభేణ=ఆబోతుచేత, ఆక్రాన్తా=వెంబడించబడిన యావు. A cow in heat. |
| థ వేహా ద్గర్భోపఘాతినీ। | వేహత్॥త్॥-౧గర్భోపఘాతినీ॥సీ॥౨-అంబోతుబాఅంగానీచుకొన్న యావు పేళ్లు.A cow miscarrying from unseasonable union with the bull. |
| (కాల్యో)పసర్యా(ప్రజనే) | ఉపసర్యా॥సీ॥ ౧-ప్రజనే=ప్రథమగర్భమునందు, కల్యా = ప్రాప్తమయినఋతుకాలముగలిగిన యావు పేరు. A cow fit for the bull. |
| ప్రష్ఠౌహీ (బాలగర్భిణీ)॥ ౨౪౭॥ | ప్రష్ఠౌహీ[పా]పష్ఠౌహీ॥సీ॥౧-బాలగర్భిణీ=బాల్యమునందే తొలిచూలుగలపడ్డ పేరు. A pregnant heifer; a cow with calf for the first time. |
| (స్యా)దచణ్డీ తుసుకరా | అచణ్డీ - సుకరా॥సీ॥౨-సాధునయినయావు పేళ్లు. A tractable cow. |
| బహుసూతిః పరేష్టుకా। | బహుసూతిః - పరేష్టుకా॥ సీ॥౨- పెక్కు ఈతలీనినయావు పేళ్లు. A cow bearing many calves. |
| చిరసూతాబష్కయణీ | చిరసూతా-బష్కయణీ॥ సీ॥౨-తఱపియావు పేళ్లు. A cow whose calf is full grown. |
| ధేను(స్స్యా)న్నవసూతికా॥ ౨౪౮॥ | ధేనుః-నవసూతికా॥సీ॥౨- లేగటియావు పేళ్లు. A cow recently calved. |
| సువ్రతా సుఖసన్దోహ్యా | సువ్రతా-సుఖసన్దోహ్యా॥ సీ॥౨ - సులభముగాపితుకనిచ్చు నావు పేళ్లు. A cow easily milked. |
| పీనోఘ్నీ పీవరస్తనీ। | పీనోఘ్నీ -పీవరస్తనీ॥సీ॥ ౨- పెద్దపొదుగుగలయావు పేళ్లు. A cow with allarge udder. |
| ద్రోణక్షీరా ద్రోణ | ద్రోణక్షీరా-ద్రోణదుఘా॥ సీ॥ ౨ - ఇద్దుము |

దుఘా
ధేనుష్యా (బన్ధకే స్థితా)॥ ౬౯॥

పాలుపితికెడి యావుపేళ్లు.
ధేనుష్యా॥ సీ॥ ౧- బన్ధకే=కుదువలో, స్థితా= ఉన్నయావుపేరు. A cow pledged.

సమాంసమీనా (సా ద్యైవ ప్రతివర్షం ప్రసూయతే)।

సమాంసమీనా॥సీ॥౧-ద్యైవ= ఏయావు, ప్రతివర్షమ్=ప్రతిసంవత్సరమును, ప్రసూయతే=ఈనుచున్నదో, సా = ఆయావుపేరు. A cow calving every year. [Udder.

ఊధ (స్తు క్లీబ)మాపీనం

ఊధః॥న్॥ - ఆపీనమ్॥న॥ ౨ - పొదుగుపేళ్లు.

(సమౌ) శివక కీలకౌ॥ ౭౦॥

శివకః-కీలకః॥ పు॥ ౨-పసులఁగట్టుగూటము పేళ్లు. A pillar for tying cattle.

(నపుంసి) దామసన్దానం

దామ॥న్,స్త్రీ॥-సన్దానమ్॥న॥౨-తలుగుపేళ్లు. త్రాడు. A rope or cord.

(పశురజ్జుస్తు) దామనీ।

పశురజ్జుః-దామని [పా] బన్ధనీ॥ సీ॥ ౨-పసుల గట్టుదామెన. A foot-rope for cattle.

వైశాఖ మన్థ మన్థాన మన్థానో మన్థదణ్డకే॥

వైశాఖః-మన్థః-మన్థానః-మన్థాః॥ న్॥-మన్థదణ్డకః॥పు॥౫-కవ్వము. A churning stick.

కుటరో దణ్డవిష్కమ్భో

కుటరః [పా] కుఠరః-దణ్డవిష్కమ్భః॥పు॥ ౨-తరికంబముపేళ్లు. [A churning-vessel.

మన్థనీ గర్గరీ (సమే)।

మన్థనీ-గర్గరీ॥సీ॥౨- పెరుఁగుద్రచ్చుకడవపేళ్లు.

ఉష్ట్రే క్రమేలక మయ మహాఙ్గాః

ఉష్ట్రః-క్రమేలకః- మయః - మహాఙ్గః॥పు॥౪-ఒంటెపేళ్లు. A camel. [young camel.

కరభ (శ్శిశుః)॥ ౭౧॥

కరభః॥ పు॥ ౧ - శిశుః = ఒంటెపిల్లపేరు. A

(కరభాస్స్యుః) శృఙ్ఖలకా (దారవైః పాదబన్ధనైః)।

శృఙ్ఖలకాః॥ పు॥ ౧-దారవైః=మానితోఁజేసిన, పాదబన్ధనైః = కాళ్లబందములతోఁ గూడిన, కరభాః=ఒంటెపిల్లలపేరు.

అజా ఛాగీ

అజా-ఛాగీ॥సీ॥ ౨-మేఁకపేళ్లు. A she-goat.

శుభచ్ఛాగ బస్తచ్ఛగలకా అజే॥ ౭౨॥

శుభః- ఛాగః- బస్తః - ఛగలకః - అజః॥పు॥ ౫- మేఁకపోతు పేళ్లు. A he-goat.

మేఢ్రోరభ్రోరణోర్ణా

మేఢ్రః - ఉరభ్రః - ఉరణః - ఊర్ణాయుః -

యుమేష వృష్ణయ ఏడ కే। (ఉష్ట్రోరభ్రాజబృన్దే న్యా) దౌష్ట్రకౌరభ్రకాజకమ్॥ ౬౫౭॥

మేషః-వృష్ణిః-ఏడకః॥పు॥ ౭-గొఱ్ఱెపేళ్లు. A ram. ఔష్ట్రకమ్॥న॥-ఔరభ్రకమ్॥న॥-ఆజకమ్ ॥న॥-ఈ౩ను వరుసగా,ఉష్ట్రోరభ్రాజబృన్దే=ఒంటెలయొక్కయు గొఱ్ఱెలయొక్కయు మేఁకలయొక్కయుగుంపుపేళ్లు.

చక్రీవన్తస్తుబాలేయా రాసభా గర్దభాఃఖరాః।

చక్రీవాన్॥త్॥-బాలేయః-రాసభః-గర్దభః-ఖరః॥పు॥౫-గాడిదపేళ్లు. An ass.

వైదేహకః సార్థవాహో నైగమో వాణిజో వణిక్॥ ౬౫౫॥ పణ్యాజీవో ఽప్యాపణికః క్రయవిక్రయికశ్చ సః।

వైదేహకః-సార్థవాహః-నైగమః-వాణిజః-వణిక్॥జ్॥-పణ్యాజీవః-ఆపణికః-క్రయవిక్రయికః॥పు॥౮-వర్తకునిపేళ్లు. A trader, merchant.

విక్రేతా (స్యా) ద్విక్రయికః

విక్రేతా॥ఋ॥-విక్రయికః॥పు॥౨-అమ్మెడువానిపేళ్లు. A vender, seller.

క్రాయికః క్రయిక (స్సమౌ)॥ వాణిజ్యంతువణిజ్యా (స్యా)

క్రాయికః-క్రయికః॥పు॥౨ - కొనువానిపేళ్లు. [A buyer.

వాణిజ్యమ్॥న॥-వణిజ్యా॥ స్త్రీ॥ - ౨-వర్తకముపేళ్లు, బేరము. Traffic.

న్మూల్యం వస్నో ఽ ప్యవక్రయః।

మూల్యమ్॥న॥-వస్నః-అవక్రయః॥పు॥౩-వెలపేళ్లు. Price; value.

నీవీ పరిపణో మూలధనం

నీవీ॥స్త్రీ॥-పరిపణః-మూలధనమ్॥న॥౩ - మొదలిసొమ్ముపేళ్లు. Capital; principal.

లాభో ఽ (ధికంఫలమ్) ॥ ౬౫౭॥

లాభః॥పు॥౧-అధికమ్=అధికమయిన, ఫలమ్=ఫలముపేరు, బేరమాడగామిగిలినసొమ్ము. Profit.

పరిదానంపరీవర్తో నైమేయ నిమయా (వపి)।

పరిదానమ్॥న॥-పరీవర్తః-నైమేయః-నిమయః॥పు॥౪-ఒకసరకిచ్చి మఱియొకసరకుమార్చుకొనుట పేళ్లు. Barter; Exchange.

(పుమా) నుపనిధిర్న్యాసః

ఉపనిధిః-న్యాసః॥పు॥ ౨-దాచఁబెట్టుటపేళ్లు. A deposit.

ప్రతిదానం (తదర్పణమ్)॥ ౬౫౮॥

ప్రతిదానమ్॥న॥౧-తదర్పణమ్=ఆదాచఁబెట్టినవస్తువును తిరుగనిచ్చుట. Return of deposit.

(క్రయే ప్రసారితం) క్రయ్యం క్రేయం (క్రేతవ్యమాత్రకే) । విక్రేయం పణితవ్యంచ పణ్యం (క్రయ్యాదయ స్త్రిషు) ॥ ౬౫౯॥

క్రయ్యమ్॥౧-క్రయే = కొనుటకు, ప్రసారితమ్=పచరింపఁబడిన వస్తువు పేరు, మళిగలోఁ బెట్టినది. Exposed for sale. క్రేయమ్॥ ౧-క్రేతవ్యమాత్రకే=కొనుటకుఁ బచరింపఁబడనికొనఁదగిన వస్తుమాత్రమునకు పేరు. Purchasable. విక్రేయమ్-పణితవ్యమ్-పణ్యమ్॥ ౩-అమ్మఁదగిన వస్తువు పేళ్లు. Saleable. క్రయ్యాదయః = క్రయ్యశబ్దము మొదలుగాఁగల వైదును॥ త్రి॥

(క్లీబే) సత్యాపనం సత్యంకార స్సత్యాకృతిః (స్త్రియామ్)।

సత్యాపనమ్॥న॥-సత్యంకారః॥పు॥-సత్యాకృతిః॥స్త్రీ॥౩-ఒక వస్తువు నమ్మెదననిగాని కొనెదనని గాని సత్యముగా చెల్లనాడుట పేళ్లు. సంచకరము. Ratification of a bargain.

విపణో విక్రయః

విపణః-విక్రయః॥పు॥౨-అమ్ముట పేళ్లు. Sale.

(స్సంఖ్యాస్సంఖ్యేయే హ్యాదశ త్రిషు)॥౬౬౦॥

సంఖ్యాః=ఏకశబ్దము మొదలయిన సంఖ్యావాచకశబ్దములు, ఆదశ=అష్టాదశశబ్దము వఱకు, సంఖ్యేయే=లెక్క పెట్టందగిన వస్తువులయందు వర్తించును. అవియన్నియు॥ త్రి॥. ఉదాహరణము. ఏకః పురుషః-ఏకా స్త్రీ-ఏకం కులమ్-అష్టాదశ పురుషాః అష్టాదశ స్త్రియః-అష్టాదశ కులాని, మొదలైనవి.

(వింశత్యాద్యా స్సదైకత్వే సర్వా స్సంఖ్యేయసంఖ్యయోః) ।

వింశత్యాద్యాః=ఏకోనవింశతిశబ్దము మొదలయిన, సర్వాః=తక్కిన సంఖ్యావాచకశబ్దములన్నియు, సంఖ్యేయసంఖ్యయోః= లెక్క పెట్టఁదగిన వస్తువునందును లెక్కయందును వర్తించును, సదా=ఎల్లప్పుడును, ఏకత్వే=ఏకవచనాంతములై యుండును, ఉదాహరణము. వింశతిర్గావః, గవాం వింశతిః.

(సంఖ్యార్థే ద్విబహుత్వే స్తః)

ఆ వింశత్యాదులు, సంఖ్యార్థేసతి=మఱియొక సంఖ్యావాచకార్థము లగుచుండఁగా, ద్విబహుత్వే=ద్వివచనము బహువచనములందు నగును. ఉ. గవాం ద్వేవింశతీ. గవాం తిస్రోవింశతయః.

(తాసుచానవతేః స్త్రియః)॥ ౬౬౧॥

తాసు=ఆవింశత్యాదులయందు, ఆ నవతేః = నవతిశబ్దపర్యంతము, అనఁగా వింశతిత్రింశచ్చత్వారింశత్పఞ్చాశత్షష్టిసప్తత్యశీతినవతి శబ్దములు, స్త్రియః= స్త్రీలింగములగును. వింశత్యాపురుషైః, వింశత్యాస్త్రీభిః, వింశత్యాకులైః-అని ॥ఉ॥

(పంక్తేశ్శతసహస్రాదిక్రమా ద్దశగుణోత్తరమ్)।

పంక్తేః=పదిమొదలుకొనిపరార్థమువఱకు,దశగుణోత్తరమ్ = పదింటగుణించిన లెక్కలు, క్రమాత్ =వరుసగా, శతసహస్రాదః=శతము సహస్రము మొదలైనసంఖ్యలౌను. పదిపదులు శతము-పదిశతములుసహస్రమని యిట్లూహించునది.

యౌతవంద్రువయం పాయ్య (మితిమానార్థకం త్రయమ్)॥౬౬౨॥

యౌతవమ్-ద్రువయమ్-పాయ్యమ్॥ న॥ ఈ 3 ను, మానార్థకమ్=మానశబ్దార్థముగలది. మానమనఁగా తూచుటకును,కొలుచుటకును సాధనములైన తులాఙ్గులి ప్రస్థాదులకు సామాన్యనామము.

Measure.

మానంతులాఙ్గులి ప్రస్థై

మానమ్=ఆమానము,తులాఙ్గులిప్రస్థైః=త్రాసుచేతను, అంగులము మొదలయిన వానిచేతను,తూము మొదలయిన వానిచేతను మూఁడువిధములుగానుండును. దానికిక్రమముగా, ఉన్మానము (by weight), ప్రమాణము (measure of length), పరిమాణము (measure of capacity). అనిపేళ్లు.

(గుఞ్జాః పఞ్చ)ఆద్యమాషకః।

ఆద్యమాషకః॥ పు॥ ౧ - (వెండిగాకతక్కిన) గుఞ్జాఃపఞ్చ=ఐదుగురిగింజలయెత్తుగలబంగారము మొదలయిన దానిపేరు. Equal in weight to five seeds of abrus precatorius.

(తేషోడశాక్షః) కర్షో ఽ(స్త్రీ)

అక్షః॥పు॥-కర్షః॥ప్న॥ ౨- షోడశ=పదాఱైన, తేః=ఆయాద్యమాషకము ఎత్తుగలదానిపేళ్లు.

పలం (కర్షచతుష్టయమ్)॥ ౬౬౩॥

పలమ్॥న॥౧-కర్షచతుష్టయమ్ - నాలుగుకర్షములయెత్తుగలదానిపేరు.

సువర్ణ బిస్తౌ (హే

సువర్ణః-బిస్తః[పా]విస్తః॥పు॥ ౨- హేమ్నః=బంగా

| | |
|---|---|
| మ్నా ఉక్షే) | రముయొక్క, అక్షే=అక్షమెత్తుపేళ్లు. [రుపేరు. |
| కురుబి స్తస్తుతత్పలే। | కురుబిస్తః॥పు॥౧- తత్పలే=ఆపలమెత్తుబంగా |
| తులా (స్త్రియాం ప | తులా॥స్త్రీ॥౧-పలశతమ్= నూఱుపలాలమెత్తు |
| లశతం) | గలదానిపేరు, |
| భార (స్స్యాద్వింశతి | భారః[ప]భరః॥పు॥౧,వింశతిఃతులాః=ఇరువది |
| స్తులాః)॥ ౬౬౮॥ | తులములమెత్తుగలదానిపేరు. |
| ఆచితో దశ భారా | ఆచితః॥పు॥[ప]॥న॥౧-దశభారాః=పదిబారువు |
| స్స్యు) | లపేరు. [భారః=బరువుపేరు. A cartload. |
| (శ్శాకటోభార)ఆచితః। | ఆచితః॥పు॥౧-శాకటః= బండిచేతమోయందగిన, |
| కార్షాపణః కార్షిక | కార్షాపణః-కార్షికః॥ పు॥౨ - (రెండుగురిగింజల |
| (స్స్యా) | మెత్తువెండియొకమాషకము, పదాఱుమాషక |
| | ములొకకర్షము,అట్టి) కర్షమెత్తువెండిచేఁజేయం |
| | బడినటంకముద్రపేళ్లు. [రాగిముద్రపేరు. |
| (త్కార్షికేతామ్రికే)పణః॥ | పణః॥పు॥౧-కార్షికే=కర్షమెత్తుగల,తామ్రికే= |
| (అస్త్రియా) మాఢ | ఆఢకః ॥ ప్న॥ ౧ = తూము. ద్రోణః॥ప్న॥౧= |
| క ద్రోణౌ ఖారీ వా | నలుతుము. ఖారీ॥ స్త్రీ॥ ౧=పుట్టి. వాహః॥పు॥ ౧= |
| హోనికుఞ్చకః। కుడ | ఇరువదిపుట్లు. నికుఞ్చకః॥పు॥ ౧=సోల. కుడవః॥ |
| వః ప్రస్థ (ఇత్యాద్యాః | పు॥౧=మానిక. ప్రస్థః॥పు॥ ౧=కుంచము, ఇత్యా |
| పరిమాణార్థకాః పృథ | ద్యాః=ఇవిమొదలైనవియు,ఆదిపదముచేతమాన |
| క్)॥ ౬౬౯॥ | ప్రవర్తికాదులును. పృథక్=వేర్వేఱుగా, పరిమా |
| | ణార్థకాః=పరిమాణవాచకములు. ఈగాఢకా |
| | దులాగూదేశములకుఁదగినట్టు సంజ్ఞలుగలిగినవి. |
| (భాగ స్తురీయః) పా | పాదః॥పు॥ ౧-తురీయః=(ఒకదానియందు)నా |
| ద (స్స్యాత్) | లవ, భాగః=భాగముపేరు. A quarter. |
| అంశభాగౌతు వణ్టకః। | అంశః-భాగః-వణ్టకః॥పు॥౩పాలిపేళ్లు.A part;share |
| ద్రవ్యం విత్తంస్వాప | ద్రవ్యమ్-విత్తమ్-స్వాపతేయమ్-రిక్థమ్ - ఋ |
| తేయం రిక్థ మృక్థం ధ | క్థమ్-ధనమ్-వసు- హిరణ్యమ్-ద్రవిణమ్ - ద్యు |
| నం వసు॥ ౬౭౦॥ హిర | మ్నమ్॥న॥-అర్థః-రాః॥ఐ॥-విభవః॥పు॥౧౩-ధనము |
| ణ్యం ద్రవిణం ద్యుమ్న | పేళ్లు. Wealth; substance. |

మర్థా రై విభవా అపి।
(స్యా) త్కోశశ్చ హిరణ్యం(చ హేమరూప్యే కృతాకృతే)॥ ౬౬౮॥

కోశః[పా]కోషః॥పు॥- హిరణ్యమ్॥న॥౨- కృతాకృతే= కరఁగినదియు సొమ్ముగాఁ జేయబడినదియునగు కృతమును, గనియందుఁబుట్టినపాడియగుఅకృతమునగు, హేమరూప్యే=బంగారునకును వెండికిని. Wrought or unwrought gold or silver.

(తాభ్యాం యదన్య త్తత్) కుప్యం

కుప్యమ్॥న॥౧- తాభ్యామ్=ఆ వెండిబంగారములకంటె, యత్ అన్యత్ =ఇతరమయినరాగికంచు మొదలగున లోహముపేరు. Base metals.

రూప్యం (తద్ద్వయ మాహతమ్)।

రూప్యమ్॥న॥ ౧-ఆహతమ్=ముద్రవేయఁబడిన, తద్ద్వయమ్=ఆ వెండిబంగారములు. Stamped coin.

గారుత్మతం మరకత మశ్మగర్భో హరిన్మణిః॥

గారుత్మతమ్-మరకతమ్॥న॥- అశ్మగర్భః-హరిన్మణిః॥పు॥౪-పచ్చలపేళ్లు. An emerald.

శోణరత్నం లోహితకః పద్మరాగో౽థ మౌక్తికమ్। ముక్తా౽థ విద్రుమః(పుంసి)ప్రవాలం(పున్నపుంసకమ్)॥

శోణరత్నమ్॥న॥-లోహితకః-పద్మరాగః॥పు॥౩-కెంపులపేళ్లు. A ruby.

మౌక్తికమ్॥న॥- ముక్తా॥స్త్రీ॥ ౨ - ముత్యము పేళ్లు. A pearl.

విద్రుమః॥పు॥-ప్రవాలమ్॥న్ప॥ ౨-పగడము పేళ్లు. Coral.

రత్నం మణి (ర్ద్వయో రశ్మజాతౌ ముక్తాదికే౽పి చ)॥

రత్నమ్॥న॥-మణిః॥న్ప॥-ఈ ౨ ను, అశ్మజాతౌ=శిలాజాతులయిన మరకతాదులకును, ముక్తాదికే౽పిచ=ముత్యమునకు పగడమునకును సామాన్యముగాపేళ్లు. A gem; a precious stone.

స్వర్ణం సువర్ణం కనకం హిరణ్యం హేమ హాటకమ్॥ తపనీయం శాతకుమ్భం గాఙ్గేయం భర్మ కర్బురమ్। చామీకరం జాతరూపం మహారజత కాఞ్చనే॥ రుక్మం కార్త

స్వర్ణమ్-సువర్ణమ్-కనకమ్- హిరణ్యమ్- హేమ॥న్॥-హాటకమ్-తపనీయమ్- శాతకుమ్భమ్-గాఙ్గేయమ్-భర్మ॥న్॥-కర్బురమ్-చామీకరమ్-జాతరూపమ్-మహారజతమ్ - కాఞ్చనమ్-రుక్మమ్-కార్తస్వరమ్-జామ్బూనదమ్॥న॥-అష్టాపదః॥న్ప॥ ౧౯-బంగారుపేళ్లు. Gold.

స్వరం జాంబూనదమ
ష్టాపదోఽ(స్త్రియాం)
(అలఙ్కారసువర్ణం
య)చ్ఛృఙ్గీకనకమి(త్య
దః)॥ ౯౩॥

శృఙ్గీకనకమ్॥న॥౧-ఇతిఅదః=ఈశబ్దము, అలఙ్కారసువర్ణమ్= సొమ్ముగాఁజేసిన బంగారముపేరు. శృంగి యనిప్రత్యేకనామమును. Gold for ornaments.

దుర్వర్ణం రజతం రూ
ప్యం ఖర్జూరం శ్వేత
(మిత్యపి)।

దుర్వర్ణమ్-రజతమ్-రూప్యమ్-ఖర్జూరమ్[పా]ఖర్జురమ్-శ్వేతమ్॥న॥౫-వెండిపేళ్లు. Silver.

రీతిః (స్త్రియాం) మా
రకూటో(న స్త్రియాం)

రీతిః[పా]రీతీ॥స్త్రీ॥-ఆరకూటః॥పు॥౨ - ఇత్తడి పేళ్లు. Brass.

(మథ) తామ్రకమ్॥శు
ల్బం మ్లేచ్ఛముఖం ద్వ్య
ష్టవరిష్ఠోదుమ్బరాణి చ।

తామ్రకమ్-శుల్బమ్ - మ్లేచ్ఛముఖమ్- ద్వ్యష్టమ్-వరిష్ఠమ్-ఉదుమ్బరమ్[ప]ఔదుమ్బరమ్॥న॥౬-రాగిపేళ్లు. Copper.

లోహోఽ(స్త్రీ)శ
స్త్రకం తీక్ష్ణం పిణ్డం కా
లాయసాయసీ॥ ౯౫॥
అశ్మసారోఽ

లోహః॥పు॥-శస్త్రకమ్ - తీక్ష్ణమ్-పిణ్డమ్-కాలాయసమ్[పా]కృష్ణాయసమ్ - అయః॥న॥-అశ్మసారః॥పు॥౭-ఇనుముపేళ్లు. Iron.

థమణ్డూరం సింహాణ
(మపితన్మలే)।

మణ్డూరమ్-సింహాణమ్- [పా] శిఙ్ఘాణమ్॥ న॥ ౨-ఆ ఇనుపచిట్టెము పేళ్లు. Rust of iron.

(సర్వం చ తైజసం)
లోహం
Any thing metallic.

లోహమ్॥ న॥౧-తైజసమ్= తేజోయుక్తములయిన, సర్వమ్=సువర్ణ రజత తామ్ర రీతి కాంస్య త్రపు సీస ధీవరములను నెనిమిదికిని పేరు.

(వికార స్త్వయసః)
కుశీ॥ ౯౬॥

కుశీ॥స్త్రీ॥౧-అయసః వికారః=ఇనుమునఁజేసిన వానికి నన్నిటికిని పేరు, కఱ్ఱుకేపేరని కొందఱు Bar iron; wrought iron.

క్షారః కాచోఽ

క్షారః-కాచః॥పు॥ ౨-గాజుపేళ్లు. Glass.

థ చపలో రసస్సూత
శ్చ పారదే।

చపలః- రసః- సూతః- పారదః[ప]పారతః॥పు॥ ౪- పాదరసముపేళ్లు. Quicksilver.

గవలం (మాహిషం

గవలమ్॥న॥౧-మాహిషమ్=ఎనుముసంబంధ

శృఙ్గ)

మయిన, శృఙ్గమ్=కొమ్ముపేరు. Buffalo's horn.

మభ్రకం గిరిజా ము
లే॥ Talc; mica.

అభ్రకమ్-గిరిజమ్-అమలమ్॥న॥౩-అభ్రకము పేళ్లు. "గిరిజామలమ్" అనియొక పేరనికొందఱు.

స్రోతోఞ్జనం తు సౌ
వీరం కాపోతాఞ్జనయా
మునే।

స్రోతోఞ్జనమ్-సౌవీరమ్-కాపోతాఞ్జనమ్-యామునమ్॥న॥౪-సౌవీరాంజనము పేళ్లు. Antimony.

తుత్థాఞ్జనం శిఖిగ్రీ
వంవితున్నకమయూర
కే॥ ౬౭॥ కర్పరీదార్వి
కా క్వాథోద్భవం తు
త్థం రసాఞ్జనమ్। రసగ
ర్భం తార్క్ష్యశైలం

తుత్థాఞ్జనమ్-శిఖిగ్రీవమ్ - వితున్నకమ్-మయూరకమ్-కర్పరి॥ సీ॥ ౫-తుత్థాంజనము. మైలుతుత్తము. Blue Vitriol. దార్వికా॥సీ॥-క్వాథోద్భవమ్-తుత్థమ్, రసాఞ్జనమ్-రసగర్భమ్-తార్క్ష్యశైలమ్॥న॥ ౬-రసాంజనము. Collyrium. ఇచట తుత్థాంజనము మొదలు-౪-మైలు తుత్తమునకును,కర్పరీదార్వికాశబ్దములు -౨- వంటసలసంబుట్టినమైలుతుత్తమునకును, రసాంజనము మొదలు ౪ను రసాంజనము పేళ్లనికొందఱు.

గన్ధాశ్మని తు గన్ధకః।
౬౮॥ సౌగన్ధికశ్చ

గన్ధాశ్మా॥ న్॥ - గన్ధకః [పా] గన్ధికః - సౌగన్ధికః॥పు॥ ౩-గంధకముపేళ్లు. Sulphur.

చక్షుష్యా కులాలీ
తు కులత్థికా ।

చక్షుష్యా-కులాలీ- కులత్థికా॥ సీ॥ ౩ - కుళుత్థాంజనము పేళ్లు.

రీతిపుష్పం పుష్పకే
తు పౌష్పకం కుసు
మాఞ్జనమ్॥ ౬౯॥

రీతిపుష్పమ్॥ న॥ - పుష్పకేతు॥ న ॥ - పౌష్పకమ్[పా]పుష్పకమ్ - కుసుమాఞ్జనమ్॥న॥ ౩-కుసుమాంజనము పేళ్లు. Calx of brass.

పిఞ్జరం పీతనం తాల
మాలం చ హరితాలకే।

పిఞ్జరమ్-పీతనమ్-తాలమ్-ఆలమ్ - హరితాలకమ్॥న॥ ౫-హరిదళము. Yellow orpiment.

గైరేయమర్థ్యం గిరి
జమశ్మజం చ శిలాజతు॥

గైరేయమ్- అర్థ్యమ్- గిరిజమ్- అశ్మజమ్- శిలాజతు॥న॥౫-సిలాజిత్తు. Red chalk; Bitumen.

బోలగన్ధరసప్రాణ
పిణ్డగోపరసా(స్సమాః)

బోలః - గన్ధరసః - ప్రాణః - పిణ్డః - గోపః [పా] గోపః-రసః [పా] శశః॥పు॥ ౬ - బోళము పేళ్లు.గోపరసమనియొక పేరుగాకొందఱు. Myrrh

డిణ్డీరోఽబ్ధికఫః ఫేనః

డిణ్డీరః [పా] హిణ్డీరః - అబ్ధికఫః - ఫేనః॥పు॥౩-సముద్రపునురుఁగు పేళ్లు. Cuttle fish.

సిన్దూరం నాగసంభవమ్॥ ౬౮౨॥

సిన్దూరమ్-నాగసంభవమ్॥న॥౨-సిందూరము పేళ్లు. Minium, or red lead.

నాగ సీసక యోగేష్ట వప్రాణి

నాగమ్-సీసకమ్-యోగేష్టమ్-వప్రమ్॥న॥౪-సీసము పేళ్లు. Lead.

త్రపు పిచ్చటమ్। రఙ్గ వఙ్గేఽ

త్రపు-పిచ్చటమ్-రఙ్గమ్-వఙ్గమ్॥న॥౪ - తగరము పేళ్లు. Tin.

పృథ పిచు స్తూలోఽథ కమలోత్తరమ్॥

పిచుః-తూలః [ప] పిచుతూలః॥ పు॥ ౨ - దూది పేళ్లు. Cotton.

(స్యా) త్కుసుమ్భం వహ్నిశిఖం మహారజన (మిత్యపి)।

కమలోత్తరమ్-కుసుమ్భమ్-వహ్నిశిఖమ్-మహారజనమ్॥న॥౪-కుసుమపువ్వు పేళ్లు. Safflower; Carthamus.

మేషకమ్బల ఊర్ణాయు

మేషకమ్బలః-ఊర్ణాయుః॥పు॥౨-గొఱ్ఱెవెండ్రుకల చేత నేసిన కంబళి పేళ్లు. A woollen blanket.

శ్శశోర్ణం శశలోమని॥ ౬౮౪॥

శశోర్ణమ్-శశలోమ॥న॥౨-కుందేటివెండ్రుకల పేళ్లు. Hare's or rabbit's hair.

మధు క్షౌద్రం మాక్షికాది

మధు-క్షౌద్రమ్-మాక్షికమ్ ॥న॥ - ఈ ౩ ను మాక్షికాది = మాక్షిక, భ్రామర, పౌత్తికములను ౩ తేనెలకును పేళ్లు. Honey.

మధూచ్ఛిష్టంతు సిక్థకమ్।

మధూచ్ఛిష్టమ్-సిక్థకమ్॥న॥౨-మైనము పేళ్లు. Wax.

మనశ్శిలా మనోగుప్తా మనోహ్వా నాగజిహ్వికా॥౬౮౫॥ నైపాలీ కునటీ గోలా

మనశ్శిలా - మనోగుప్తా-మనోహ్వా- నాగజిహ్వికా॥స్త్రీ॥౪-మణిశిల పేళ్లు. Red arsenic. నైపాలీ-కునటీ-గోలా॥స్త్రీ॥ ౩-నేపాళదేశమునందుఁ బుట్టిన మణిశిల పేళ్లు. మనశ్శిలాదులు, ౭-మణిశిల పేళ్లు.

యవక్షారో యవాగ్రజః। పాక్యోఽ

యవక్షారః-యవాగ్రజః-పాక్యః॥పు॥౩ - యవక్షారము పేళ్లు. Nitre; Saltpetre.

థ సర్జికాక్షారః కాపోతస్సుఖవర్చకః॥ సౌవ

సర్జికాక్షారః-కాపోతః-సుఖవర్చకః॥ పు॥-సౌవర్చలమ్-రుచకమ్॥ న ॥ ౫- సజ్జాకారము పేళ్లు.

| | |
|---|---|
| ర్చలం (స్యా) ద్రుచకం | Alkali; Natron. |
| త్వక్క్షీరీ వంశరోచనా। | త్వక్క్షీరీ॥ సీ॥-వంశరోచనా॥ సీ॥ ౨-తవక్షీరి పేళ్లు. Mauna of bamboos. [లపేళ్లు. |
| శిగ్రుజం శ్వేతమరిచం మోరటం(మూలమైక్షవమ్)॥ ౬౮౭॥ | శిగ్రుజమ్-శ్వేతమరిచమ్॥న॥ ౨- మునగవిత్తు మోరటమ్॥న॥ ౧ - చెఱకువేళ్ల పేరు. Root of sugarcane. |
| గ్రన్థికం పిప్పలీమూలం చటికా శిర (ఇత్యపి)। | గ్రన్థికమ్-పిప్పలీమూలమ్ - చటికాశిరః॥స్, న॥ [ప] చటికా॥ సీ॥-శిరః[పా]సిరః॥పు॥౩-పిప్పలీమూలము పేళ్లు. Root of long pepper. |
| గోలోమీ భూతకేశో (నా) | గోలోమీ॥సీ॥-భూతకేశః॥పు॥౨-జటామాంసి పేళ్లు. భూతకేశమనుతృణముపేళ్లని కొందఱు. Root of sweet flag. |
| పత్త్రాఙ్గం రక్తచన్దనమ్॥ ౬౮౮॥ | పత్త్రాఙ్గమ్-రక్తచన్దనమ్॥న॥ ౨- ఎఱ్ఱనిచందనము పేళ్లు. Red-wood. |
| త్రికటు త్ర్యూషణం వ్యోషం | త్రికటు-త్ర్యూషణమ్[పా] త్ర్యుషణమ్-వ్యోషమ్॥న॥ ౩-సొంటి పిప్పలిమిరియాలకూటమి పేళ్లు. |
| త్రిఫలా (తు) ఫలత్రికమ్। | త్రిఫలా॥సీ॥-ఫలత్రికమ్॥న॥౨-కరక తాడి ఉసిరికల యొక్క మూఁడిటికూటమి పేళ్లు. Three myrobalans. |
| ఇతి వైశ్యవర్గః. | వైశ్యులతోఁ జేరిన పదసమూహము ముగిసెను. |

| | |
|---|---|
| శూద్రా శ్చావరవర్ణా శ్చ వృషలాశ్చ జఘన్యజాః॥ ౬౮౯॥ | శూద్రః-అవరవర్ణః-వృషలః-జఘన్యజః॥ పు॥ ౪-శూద్రుల పేళ్లు. Men of the fourth tribe. |
| (ఆచణ్డాలాత్తు)సంకీర్ణా (అమ్బష్ఠకరణాదయః)। | సంకీర్ణాః॥ ౧-చండాలశబ్దపర్యంతనుముందు చెప్పఁగల అంబష్ఠకరణాదిజాతులు సంకరజాతులనంబడుదురు. Men of mixed origin. |
| (శూద్రావిశోస్తు) కరణో | కరణః॥ పు॥ ౧ - శూద్రస్త్రీకిని వైశ్యునికినిఁ బుట్టి లేఖనవృత్తిగలవాని పేరు. A scribe. |
| ఽమ్బష్ఠో(వైశ్యాద్విజ | అమ్బష్ఠః॥ పు॥ ౧ - వైశ్యస్త్రీకిని బ్రాహ్మణుని |

| | |
|---|---|
| స్యనోః)॥ ౬౯౦॥ | కిని పుట్టి చికిత్సావృత్తిగలవాని పేరు. |
| (శూద్రాక్షత్రియయోః)యుగ్రో | ఉగ్రః॥పు॥ ౧- శూద్రస్త్రీకిని క్షత్రియునికిని పుట్టి శస్త్రవృత్తిగలవాని పేరు. |
| మాగధః(క్షత్రియావిశోః)। | మాగధః॥పు॥ ౧-క్షత్రియస్త్రీకిని వైశ్యుని కిని పుట్టి స్తుతిపాఠవృత్తిగలవాని పేరు. |
| మాహిష్యోఽర్యా క్షత్రియయోః) | మాహిష్యః॥ పు॥ ౧-వైశ్యస్త్రీకినిక్షత్రియునికినిపుట్టిజ్యోతిషశకునస్వరశాస్త్రములుజీవికగాగల వాని పేరు. |
| క్షత్తాఽర్యాశూద్రయోస్సుతః)॥ ౬౯౧॥ | క్షత్తా॥ఋ, పు॥౧- క్షత్రియస్త్రీకిని శూద్రునికిని పుట్టి వేటవృత్తిగలవాని పేరు. అర్యాశబ్దము క్షత్రియస్త్రీవాచకము. |
| (బ్రాహ్మణ్యాం క్షత్రియా)త్సూత | సూతః॥ పు ॥ ౧ - బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునివలనఁ బుట్టి సారథ్యాదివృత్తిగల వాని పేరు. A charioteer. |
| (స్తస్యాం)వైదేహకో (విశః)। | వైదేహకః ॥పు॥ ౧ - బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునివలనఁ బుట్టినవాని పేరు. వైశ్యస్త్రీకినిశూద్రునికినిపుట్టినవాని పేరనికొందఱు. |
| రథకారః (స్తుమాహిష్యాత్కరిణ్యాం యస్య సమ్భవః)॥ ౬౯౨॥ | రథకారః॥ పు॥ ౧-కరిణ్యామ్=కరిణస్త్రీయందు, మాహిష్యాత్ = మాహిష్యపురుషునివలన, యస్య=ఎవనికి, సంభవః=పుట్టుక కలదో వాని పేరు. |
| (స్యా)చ్చణ్డాల(స్తు జనితో బ్రాహ్మణ్యాంవృషలేన యః)। | చణ్డాలః [పా]చాణ్డాలః॥పు॥౧-బ్రాహ్మణ్యామ్=బ్రాహ్మణస్త్రీయందు, వృషలేన = శూద్రుని చేత, యః జనితః=పుట్టింపఁబడినవాని పేరు. |
| కారుః శిల్పీ | కారుః-శిల్పీ॥ న్, పు॥ ౨ - కంసాలవానికిని, సాలెవానికిని, మంగలవానికిని, చాకలవానికిని, ముచ్చివానికిని పేళ్లు. An artisan. |
| (సంహతైస్తైర్ద్వయోః) శ్రేణిః (స్సజాతిభిః)॥ ౬౯౩॥ | శ్రేణిః॥ స్త్రీ॥ ౧-సజాతీయులయిన శిల్పులసంఘము పేరు. A guild or company of artisans. |

కులిక (స్స్యా)త్కులశ్రేష్ఠీ

కులికః [పా] కులకః-కులశ్రేష్ఠీ ॥ న్,పు॥ ౨- శిల్పికులములోఁ బ్రధానమైన వానిపేళ్లు. The chief of a guild. An artist of high birth.

మాలాకార స్తు మాలికః।

మాలాకారః-మాలికః॥పు॥ ౨-పుష్పములుగట్టి యమ్ము వానిపేళ్లు. A florist.

కుమ్భకారః కులాల (స్స్యా)

కుమ్భకారః-కులాలః॥ పు॥ ౨ - కుమ్మరవాని పేళ్లు. A potter.

త్పలగణ్డ స్తు లేపకః ॥ ౬౯౪॥

పలగణ్డః-లేపకః॥పు॥ ౨-సున్నపుగారచేయు వాఁడు. A bricklayer or plasterer. [A weaver.

తన్తువాయః కువిన్ద (స్స్యా) త్తున్నవాయ స్తు సౌచికః।

తన్తువాయః-కువిన్దః॥పు॥ ౨-సాలెవాని పేళ్లు.

తున్నవాయః-సౌచికః॥ పు॥ ౨- చిప్పవాని పేళ్లు, కుట్రపువాఁడు. A tailor.

రఙ్గాజీవ శ్చిత్రకరః

రఙ్గాజీవః-చిత్రకరః॥పు॥ ౨-చిత్తరువువ్రాయు వానిపేళ్లు. A painter.

శస్త్రమార్జో ఽసిధావకః॥ ౬౯౫॥

శస్త్రమార్జః-అసిధావకః॥పు॥ ౨-ఆయుధములు చికిలి చేయువాఁడు. An armourer. A furbisher.

పాదూకృ చ్చర్మకార (స్స్యా)

పాదూకృత్-చర్మకారః॥పు॥ ౨- గొంటిగరవాని పేళ్లు, పాదరక్షలు కుట్టువాఁడు. A shoe-maker.

వ్యోకారో లోహకారకః।

An iron-smith.

వ్యోకారః-లోహకారకః॥పు॥ ౨-కమ్మరవాని పేళ్లు. గనిలోనినుము దెచ్చి శుద్ధలోహము సేయు కోసలాది దేశ ప్రసిద్ధలోహకారజాతి పేళ్లనియు.

నాడిన్ధమ స్స్వర్ణకారః కలాదో రుక్మకారకే॥

నాడిన్ధమః - స్వర్ణకారః - కలాదః - రుక్మకారకః॥పు॥ ౪-అగసాల వానిపేళ్లు. A goldsmith.

(స్స్యా) చ్ఛాఙ్ఖికః కామ్బవికః

శాఙ్ఖికః-కామ్బవికః॥పు॥ ౨-శంఖము చేతకడియాలు మొదలైనవి చేసియమ్ము వాని పేళ్లు. A shell-cutter.

శౌల్బిక స్తామ్రకుట్టకః।

శౌల్బికః-తామ్రకుట్టకః॥పు॥ ౨-రాగిపని చేయువానిపేళ్లు. A copper-smith.

తక్షాతు వర్ధకి స్త్వష్టా

తక్షా॥న్॥-వర్ధకిః-త్వష్టా॥ఋ॥-రథకారః- కా

రథకారశ్చ కాష్ఠతట్॥

ష్ఠతట్॥ష్,పు॥౫-వడ్లవాని పేళ్లు. A carpenter.

(గ్రామాధీనో)గ్రామతక్షః

గ్రామతక్షః॥ పు॥ ౧-గ్రామాధీనః = గ్రామమునకు నధీనుఁడయిన కాణాచివడ్లవాని పేళ్లు. A carpenter working for the village.

కౌటతక్షో(ఽనధీనకః)।

కౌటతక్షః॥పు॥౧-అనధీనకః=ఒకరికినధీనుఁడు గాక కూలికిపనిచేయు వడ్లవాని పేళ్లు. An independent carpenter.

క్షురీ ముణ్డీ దివాకీర్తి నాపితాన్తావసాయినః॥

క్షురీ॥న్॥-ముణ్డీ॥న్॥-దివాకీర్తిః-నాపితః-అన్తావసాయీ॥న్,పు॥౫-మంగలవాని పేళ్లు. A barber.

నిర్ణేజక(స్స్యా)ద్రజకః

నిర్ణేజకః-రజకః॥ పు॥ ౨ - చాకలవాని పేళ్లు. Washerman.

శౌణ్డికో మణ్డహారకః॥ A vintner.

శౌణ్డికః-మణ్డహారకః॥పు॥౨-కల్లమ్మువాని పేళ్లు A distiller and seller of spirituous liquors.

జాబాల(స్స్యా)దజాజీవీ

జాబాలః-అజాజీవీ॥న్॥ [పా] అజాజీవః ॥పు॥ ౨-మేఁకలనుగాచువాని పేళ్లు. A goatherd.

దేవాజీవస్తు దేవలః॥ ౧౯౯॥

దేవాజీవః [పా] దేవాజీవీ॥న్॥-దేవలః॥ పు॥ ౨- కూలికి దేవరను బూజించువాని పేళ్లు.

(స్యా)న్మాయా శామ్బరీ

మాయా-శామ్బరీ॥ స్త్రీ॥ ౨ - ఇంద్రజాలము మొదలయిన మాయ పేళ్లు. Jugglery.

మాయాకారస్తు ప్రాతిహారకః।

మాయాకారః-[మాయావీ-మాయీ]- ప్రాతిహారకః [పా] ప్రతిహారకః[ప] ప్రతిహారికః॥పు॥ ౨-మాయ చేయువాని పేళ్లు. A juggler.

శైలాలినస్తు శైలూషా జాయాజీవాః కృశాశ్వినః॥ ౨౦౦॥ భరతా (ఇత్యపి) నటాః

శైలాలీ॥న్॥-శైలూషః-జాయాజీవః-కృశాశ్వీ॥న్॥-భరతః-నటః॥ పు॥ ౬ -నట్టువవాని పేళ్లు. Dancers and tumblers.

శ్చారణాస్తు కుశీలవాః॥

చారణః-కుశీలవః॥పు॥౨-దిక్కులయందు సంచరించుబట్టువారికిఁగాని నట్టువవారికిఁగాని పేళ్లు. A wandering actor or singer.

| | |
|---|---|
| మార్దఙ్గికా మౌరజి కాః | మార్దఙ్గికః-మౌరజికః॥ పు॥ ౨-మద్దెలగొట్టు వారిపేళ్లు. A drummer. |
| పాణివాదాస్తు పాణి ఘాః॥ ౭౦౧॥ | పాణివాదః-పాణిఘః॥పు॥ ౨-చేతుల తాళము గొట్టువారిపేళ్లు. Clapping the hands to keep time in music. |
| వేణుధ్మాః (స్యు) ర్వైణవికాః | వేణుధ్మాః॥అ॥-వైణవికః॥ పు॥ ౨-పిల్లనగ్రోవి నూదువారిపేళ్లు. Players on the flute. |
| వీణావాదాస్తు వైణి కాః। | వీణావాదః-వైణికః॥ పు॥ ౨-వీణవాయించు వారిపేళ్లు. Players on the lute. |
| జీవాన్తక శ్శాకునికో | జీవాన్తకః-శాకునికః॥ పు॥ ౨-పక్షులపేటగాడు వానిపేళ్లు. A fowler. A bird-catcher. |
| (ద్వౌ) వాగురిక జాలి కౌ॥ ౭౦౨॥ | వాగురికః-జాలికః॥ పు॥ ౨-వల పేటగాని పేళ్లు. A hunter using nets. |
| వైతంసిక కౌటికశ్చ మాంసిక(శ్చ సమం త్రయమ్)॥ | వైతంసికః-కౌటికః-మాంసికః॥ పు॥ ౩-మాంసము విక్రయించువానిపేళ్లు. A vender of flesh-meat. |
| భృతకో భృతిభుక్క ర్మకరో వైతనిక(శ్చ సః॥ | భృతకః-భృతిభుక్॥జ్॥-కర్మకరః-వైతనికః॥ పు॥ ౫-కూలివానిపేళ్లు. A hireling; labourer. |
| వార్తావహో వైవ ధికో | వార్తావహః-వైవధికః॥ పు॥ ౨-కావడిమోయువాఁడు. A chandler. A carrier of loads on a pole. [వాఁడు. A porter. |
| భారవాహ స్తుభారికః। | భారవాహః-భారికః॥పు॥ ౨-మోపుమోయు |
| వివర్ణః పామరో నీచః ప్రాకృతశ్చ పృథగ్జనః॥ని హీనోఽపసదో జాల్మః క్షుల్లక శ్చేతర (శ్చసః)। | వివర్ణః-పామరః-నీచః-ప్రాకృతః-పృథగ్జనః-నిహీనః-అపశదః [పా] అపసదః - జాల్మః - క్షుల్లకః [ప] ఖుల్లకః-ఇతరః॥ పు॥ ౧౦-అల్పునిపేళ్లు. A low man following a degrading profession. |
| భృత్యే దాసేర దాసే య దాస గోప్యక చేట కాః॥ ౭౦౩॥ నియోజ్య | భృత్యః - దాసేరః-దాసేయః-దాసః-గోప్యకః - చేటకః - నియోజ్యః - కింకరః - ప్రేష్యః[పా] ప్రైష్యః-భుజిష్యః-పరిచారకః ॥పు॥ ౧౧- బంటు |

| | |
|---|---|
| కింకర ప్రేష్య భుజిష్య పరిచారకాః। | టు పేళ్లు, చాకరివాండ్లు. A servant or slave. |
| పరాచితపరిస్కన్న పరజాత పరైధితాః॥ | పరాచితః-పరిస్కన్నః - పరజాతః-పరైధితః॥ పు॥ ౪-పంపుడు బంటుపేళ్లు. A fostered slave. |
| మన్ద స్తున్దపరిమృజ ఆలస్య శ్శీతకో ఽ లసో ఽనుష్ణః। | మన్దః - తున్దపరిమృజః - ఆలస్యః - శీతకః - అలసః-అనుష్ణః॥ పు॥ ౬ - అలసునిపేళ్లు. A lazy man. |
| దక్షేతు చతుర పేశల పటవ స్సూత్థాన ఉష్ణ శ్చ॥ ౨౦౭॥ | దక్షః - చతురః - పేశలః-పటుః-సూత్థానః-ఉష్ణః॥ పు॥ ౬-నేర్పరిపేరు. A dexterous person. |
| చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనఙ్గమాః। నిషాద శ్వపచా వన్తే వాసి చాణ్డాల పుక్కసాః॥ ౨౦౮॥ | చణ్డాలః - ప్లవః - మాతఙ్గః-దివాకీర్తిః-జనఙ్గమః-నిషాదః-శ్వపచః - అన్తేవాసీ॥ న్॥ - చాణ్డాలః - పుక్కసః॥ పు ॥ ౧౦-మాలవానిపేళ్లు. A man of the lowest and most despised of the mixed castes. |
| (భేదాః)కిరాత శబర పులిన్దా । మ్లేచ్ఛజాతయః)। | కిరాతః॥పు॥౧-నెమిలిపింఛము మొదలయినవి కట్టుకొనువాండ్ర పేరు. శబరః॥పు॥౧-ఆకులుగట్టుకొనువాండ్ర పేరు. పులిన్దః॥పు॥౧ - తమభాష యే కాని యొకరిభాష నెఱుంగనివాండ్ర పేరు. ఈ 3 ను, భేదాః = చండాలభేదములయిన, మ్లేచ్ఛజాతయః=మ్లేచ్ఛజాతులు. Barbarians. |
| వ్యాధో మృగవధాజీవో మృగయు ర్లుబ్ధక శ్చసః॥ ౨౦౯॥ | వ్యాధః-మృగవధాజీవః-మృగయుః-లుబ్ధకః॥ పు॥౪-బోయవానిపేళ్లు.A hunter. A deer-killer. |
| కౌలేయక స్సారమేయః కుక్కురో మృగదంశకః। శునకో భషక శ్శ్వా(స్యా) | కౌలేయకః-సారమేయః - కుక్కురః - మృగదంశకః-శునకః - భషకః - శ్వా॥న్,పు॥౭-కుక్కపేళ్లు. A dog. |
| దలర్క (స్తునయోగి | అలర్కః॥పు॥౧-సయోగితః = ఔషధప్రయో |

తః)॥ ౨౧౦॥

గమువలన వెఱ్ఱిపట్టిన కుక్కపేరు. A mad dog.

(శ్వా)విశ్వకద్రు (ర్మృ
గయాకుశల)

విశ్వకద్రుః॥పు॥౧ - మృగయాకుశలః = వేఁట యందు నేర్పుగల, శ్వా=కుక్కపేరు. A hound.

స్సరమా శునీ ।

సరమా-శునీ॥స్త్రీ॥౨-ఆఁడుకుక్కపేళ్లు. A bitch.

విట్చ్వర(స్సూకరో గ్రా
మ్యో)

విట్చ్వరః॥పు॥౧-గ్రామ్యః సూకరః = ఊరఁబంది పేరు. A village hog.

బర్కర (స్తరుణః ప
శుః)॥ ౨౧౧॥

బర్కరః॥పు॥౧-తరుణః=ప్రాయపువయస్సుగల, పశుః=పశుమాత్రమునకుపేరు. Any young animal.

ఆచ్ఛోదనంమృగవ్యం
(స్యా) దాఖేటో మృగ
యా (స్త్రియామ్) ।

ఆచ్ఛోదనమ్ - మృగవ్యమ్॥న॥-ఆఖేటః॥పు॥-మృగయా॥స్త్రీ॥౪-వేఁటపేళ్లు. Chase; hunting.

(దక్షిణారు ర్లుబ్ధయో
గా)ద్దక్షిణేర్మా(కురఙ్గకః)
౨౧౨॥

దక్షిణేర్మా॥న్, పు॥౧-లుబ్ధయోగాత్ = వేఁటకాని బాణముతగులుటవలన, దక్షిణారుః = కుడిదిక్కున గాయముగల, కురఙ్గః = మృగముపేరు. A deer wounded on its right side.

చోరై కాగారిక స్తేన
దస్యు తస్కర మోష
కాః। ప్రతిరోధిపరాస్క
న్ది పాటచ్చర మలిమ్లు
చాః॥ ౨౧౩॥

చోరః[పా]చౌరః-ఐకాగారికః-స్తేనః-దస్యుః-తస్కరః-మోషకః-ప్రతిరోధీ॥న్॥- పరాస్కన్దీ॥న్॥-పాటచ్చరః-మలిమ్లుచః॥పు॥౧౦-దొంగపేళ్లు. A thief or robber.

చౌరికా స్తైన్య చౌ
ర్యేచ స్తేయం

చౌరికా॥స్త్రీ॥- స్తైన్యమ్ - చౌర్యమ్- స్తేయమ్॥న॥౪-దొంగతనముపేళ్లు. Theft.

లోప్త్రం(తు తద్ధనమ్)।

లోప్త్రమ్॥న॥౧-తద్ధనమ్=దొంగలించినసొమ్ము పేరు. Booty.

వితంస (స్తూపకరణం
బన్ధనేమృగపక్షిణామ్)॥
౨౧౪

వితంసః[పా]వీతంసః॥పు॥౧-మృగపక్షిణామ్= మృగములనుపక్షులను, బన్ధనే=పట్టుటయందు,ఉపకరణమ్=సాధనమైనయురులు మొదలైనవాని పేరు. A net, chain or cage.

ఉన్మాథః కూటయన్త్రం
(స్యా)

ఉన్మాథః॥పు॥-కూటయన్త్రమ్॥ న॥ ౨-బోనుపేళ్లు. గాలమని కొందఱు. A snare or trap.

వాగురా మృగబన్ధనీ।
శుల్బం వరాటకః (స్త్రీ తు) రజ్జు (స్త్రీషు) వటీ గుణః॥ ౨౦౫॥
ఉద్ఘాటనం ఘటీయన్త్రం (సలిలోద్వాహనం ప్రహేః)।
(పుంసి)వేమా వాయదణ్డ
సూత్రాణి (నరి)తన్తవః॥
వాణిర్వ్యూతిః (స్త్రియాం తుత్వే) పుస్తం (లేప్యాదికర్మణి)।
పాఞ్చాలికా పుత్త్రికా (స్యాద్వస్త్రదన్తాదిభిః కృతా)॥ ౨౦౬॥
పిటకః పేటకః
పేటా మఞ్జూషా
అథ విహఙ్గికా। భారయష్టి
(స్తదాలమ్బి) శిక్యం కాచః
అథ పాదుకా॥ ౨౦౭॥ పాదూరుపానత్ (స్త్రీ)
(సైవా)నుపదీనా (పదాయతా)।
నద్ధ్రీ వర్ధ్రీ వరత్రా

వాగురా-మృగబన్ధనీ॥సీ॥ ౨-మృగములను బట్టువలపేళ్లు. A net.

శుల్బమ్॥ న॥-వరాటకః॥పు॥-రజ్జుః॥ సీ॥-వటీ॥ త్రి॥-గుణః॥ పు॥ ౫-త్రాడుపేళ్లు. A cord, rope, or string.

ఉద్ఘాటనమ్-ఘటీయన్త్రమ్॥న॥-ఈ౨ను, ప్రహేః=నూతివలన, సలిలోద్వాహనమ్ = నీళ్లెత్తు రాట్నము పేళ్లు. A contrivance for raising water.

వేమా॥న్, పు॥ [ప]॥న॥-వాయదణ్డః॥పు॥ ౨-కోకలు నేయు తాఁడుపలక పేళ్లు. A loom.

సూత్రమ్॥న॥-తన్తుః॥పు॥ ౨=నూలి పేళ్లు. Thread.

వాణిః-వ్యూతిః॥సీ॥ ౨- నేయుట పేళ్లు. Weaving.

పుస్తమ్॥ న॥ ౧-లేప్యాదికర్మణి = లెప్పపుపని మొదలయినదాని పేరు. Plastering. Modelling.

పాఞ్చాలికా-పుత్త్రికా॥సీ॥ ౨- వస్త్రదన్తాదిభిః=వస్త్ర దంత కాష్ఠాదులచేత, కృతా = చేయఁబడిన బొమ్మ పేళ్లు. A doll or puppet.

పిటకః-పేటకః॥పు॥ ౨-బుట్ట పేళ్లు. A basket.

పేటా[పా]పేడా-మఞ్జూషా॥సీ॥ ౨-మందసము పేళ్లు. A box. ఈరను, పర్యాయములనికొందఱు.

విహఙ్గికా[పా]విహఙ్గమా-భారయష్టిః॥సీ॥ ౨-కావడిబద్ద పేళ్లు. A pole for carrying burdens.

శిక్యమ్॥న॥-కాచః॥ పు॥ ౨-తదాలమ్బి=ఆకావడిబద్దయందు వ్రేలు ఉట్టి పేళ్లు. Its slings.

పాదుకా - పాదూః -ఉపానత్॥ స్త్రీ,సీ॥౩-చెప్పుల పేళ్లు. A shoe.

అనుపదీనా॥సీ॥ ౧-అపదాయతా=కాలికి కొట్టబడిన, సైవ=ఆ చెప్పు పేరు. A boot.

నద్ధ్రీ-వర్ధ్రీ-వరత్రా॥సీ॥౩-వారు పేళ్లు. A thong.

(స్యాదశ్వాదేస్తాడనీ) కశా॥ ౭౯॥

కశా॥ స్త్రీ॥ ౧-అశ్వాదేః=గుఱ్ఱము మొదలయిన వానిని, తాడనీ=కొట్టుచబుకు పేరు. A whip.

చాణ్డాలికా తు కణ్డోలవీణా చణ్డాలవల్లకీ ।

చాణ్డాలికా - కణ్డోలవీణా [ప] కటోలవీణా- చణ్డాలవల్లకీ॥స్త్రీ॥౩-మాలవానివీణె పేళ్లు. A vulgar lute.

నారాచీ(స్యాదేషణికా శాణస్తు నికషః కషః ॥ ౮౦॥

నారాచీ-ఏషణికా॥స్త్రీ॥౨-త్రాసు పేళ్లు. Gold-smith's scales.

శాణః-నికషః-కషః॥ పు॥ ౩ - ఒరగల్లు పేళ్లు, సానయు. A touchstone.

వ్రశ్చనః పత్త్రపరశుః

వ్రశ్చనః-పత్త్రపరశుః॥పు॥ ౨-చీర్ణము పేళ్లు, A small saw.

ఈషికా తూలికా(సమే)।

ఈషికా- తూలికా॥స్త్రీ॥౨-చిత్తరువు వ్రాయు కుంచె పేళ్లు. A pencil or brush.

తైజసావర్తనీ మూషా

తైజసావర్తనీ-మూషా॥స్త్రీ॥౨-బంగారు మొదలైనవి కరఁగుమూస పేళ్లు. A crucible.

భస్త్రా చర్మప్రసేవికా॥

భస్త్రా-చర్మప్రసేవికా॥స్త్రీ॥ ౨-కొలిమితిత్తి పేళ్లు. Bellows.

ఆస్ఫోటనీ వేధనికా

A gimlet, or auger.

ఆస్ఫోటనీ [పా] లాస్ఫోటనీ-వేధనికా॥స్త్రీ॥ ౨-రత్నాదులు తొలులు వేయు పిడిసాన పేళ్లు.

కృపాణీకర్తరీ (సమే) ।

కృపాణీ-కర్తరీ॥స్త్రీ॥౨-కత్తెర పేళ్లు. Scissors.

వృక్షాదనో వృక్షభేదీ

A hatchet. A chisel.

వృక్షాదనః-వృక్షభేదీ॥న్, పు॥౨-మ్రాఁకులనఱకు గొడ్డలి కత్తియులి మొదలయినవాని పేళ్లు.

టఙ్కః పాషాణదారణః॥ ౮౧॥

టఙ్కః-పాషాణదారణః॥ పు॥ ౨-రాయినఱకెడు ఉలి పేళ్లు. A stone-cutter's chisel.

క్రకచో(ఽస్త్రీ)కరపత్త్రం

క్రకచః॥పు॥-కరపత్త్రమ్॥న॥౨ - అంపము పేళ్లు. A saw.

(స్యా) దారా చర్మభేదినీ ।

ఆరా-చర్మభేదినీ॥స్త్రీ॥౨-ఆరె పేళ్లు,ఇచట 'క్రకచః కరపత్త్రం స్యా దారాచర్మప్రభేదికా' అని యుం పాఠముగలదు. A shoemaker's knife.

సూర్మీ స్థూణాఽయఃప్రతిమా

సూర్మీ[పా] సూర్మి-స్థూణా-అయఃప్రతిమా॥ స్త్రీ॥ ౩-దాగలి పేళ్లు. ఇనుపప్రతిమయు. An anvil; an image of iron.

శిల్పం (కర్మకలాదిక మ్)॥ ౭_౨౩॥

కలాదికమ్=వాత్స్యాయనుఁడు సెప్పినసృత్త గీతాదిబాహ్యక్రియలు-౬౪ను, ఆలింగనచుంబ నాద్యాంతరక్రియలు-౬౪ను కళలనఁబడును. అవి మొదలైనకర్మ-అనఁగా స్వర్ణకారాది క్రియలును,శిల్పమ్॥న॥-శిల్పమనంబడును. An art.

ప్రతిమానం ప్రతిబి మ్బం ప్రతిమా ప్రతి యాతనా ప్రతిచ్ఛా యా। ప్రతికృతి రర్చా (పుంసి) ప్రతినిధి

ప్రతిమానమ్ - ప్రతిబిమ్బమ్॥న॥-ప్రతిమా - ప్రతియాతనా-ప్రతిచ్ఛాయా-ప్రతికృతిః-అర్చా॥ సీ॥-ప్రతినిధిః॥ పు ॥ ౮-విష్ణువు మొదలయినవారి మూర్తులకు సమముగా శిలాదులచేతఁ జేసినప్ర తిమపేళ్లు. A image ; a statue or picture.

రుపమోపమానం (స్యాత్)॥ ౭_౨౪॥

ఉపమా॥సీ॥-ఉపమానమ్॥న॥ ౨-సరిపోల్పఁబడు వస్తువులకును సరిపోల్చుటకును పేళ్లు. Resemblance.

(వాచ్యలిఙ్గా) స్సమ స్తుల్య స్సదృక్ష స్సదృ శస్సదృక్। సాధారణస్స మానశ్చ

సమః-తుల్యః-సదృక్షః-సదృశః-సదృక్॥శ్॥-సాధారణః-సమానః॥౭-సమానవస్తువుపేళ్లు. ఇవి విశేష్యములయొక్క లింగముగలవి.Like, similar.

(స్యురుత్తరపదే త్వ మీ॥ ౭_౨౫ ॥నిభసం కాశనీకాశ ప్రతీకాశో పమాదయః।

నిభః-సంకాశః-నీకాశః-ప్రతీకాశః॥పు॥-ఉపమా॥సీ॥౫-ఆదిశబ్దచేతకల్ప-భూత-రూప-శబ్దములును, అమీ=ఈ౫యు, ఉత్తరపదేస్యుః=సమాసమునందు తుదపదములయి సమానవస్తువుపేళ్లగును. ఉదాహరణము:—చన్ద్రనిభః,లక్ష్మీసంకాశా-పద్మనీకాశమ్-సూర్యప్రతీకాశః మొదలైనవి.

కర్మణ్యాతు విధాభృ త్యా భృతయో భర్మ వేతనమ్॥ భరణ్యంభర ణం మూల్యం నిర్వేశః పణ (ఇత్యపి)।

కర్మణ్యా-విధా - భృత్యా-భృతిః॥సీ॥-భర్మ॥ న్॥-వేతనమ్-భరణ్యమ్-భరణమ్ - మూల్యమ్॥ న॥-నిర్వేశః-పణః॥పు॥౧౧-కూలిపేళ్లు. Wages or hire.

సురా హాలిప్రియా హాలా పరిస్రుద్వరుణా

సురా-హాలిప్రియా-హాలా-పరిస్రుత్॥త్॥-వరు ణాత్మజా-గన్ధోత్తమా - ప్రసన్నా - ఇరా-కాద

త్మజా॥ గన్ధోత్తమా ప్ర
స న్నేరా కాదమ్బర్యః
పరిస్రుతా। మదిరాకశ్య
మద్యే చా

మ్బరీ-పరిస్రుతా-మదిరా॥సీ॥-కశ్యమ్-మద్యమ్॥న॥ ౧౩-కల్లుపేళ్లు. Spirituous liquor.

వ్యవదంశ(స్తుభక్షణ
మ్)॥ ౭౨॥
A relish. A condiment.

అవదంశః [పా] ఉపదంశః॥పు॥౧-మద్యపానము సేయునపుడు నంజుకొనుమాంసము మొదలయినదాని పేరు. భోజనమునందునంజుకొను ఊరుగాయ మొదలయినదియు.

శుణ్డాపానం మదస్థానం

శుణ్డా॥సీ॥-పానమ్-మదస్థానమ్॥ న॥ ౩ - కల్లుద్రాగునింటిపేళ్లు. A tavern.

మధువారా మధుక్ర
మాః।

మధువారః-మధుక్రమః॥పు॥ ౨-పెక్కుమార్లు కల్లుద్రాగుపరుసపేళ్లు. Tippling.

మధ్వాసవో మాధ
వకో మధు మార్ద్వీక
(మద్యయోః)॥ ౭౩॥

మధ్వాసవః-మాధవకః॥పు॥-మధు॥న॥౩-ఇప్పపుష్పములకల్లుపేళ్లు. మార్ద్వీకమ్॥న॥౧-ద్రాక్షపండ్లకల్లుపేరు. ఇచట మార్ద్వీకమను పాఠమున నాలుగును ఇప్పపుష్పములకల్లుపేళ్లు. Spirit distilled from the blossoms of Bassia latifolia.

మైరేయమాసవశ్శీధు

మైరేయమ్॥న॥౧-ఆరెపుష్ప బెల్లము కడుగు నీళ్ల చేతఁ జేసినకల్లు. ఆసవః॥పు॥ ౧-పక్వముగాని చెఱకురసమునఁ జేసినకల్లు. శీధుః॥పు॥ ౧-పక్వమయిన చెఱకురసమునఁ జేసినకల్లు.

ర్మేదకో జగల (స్స
మౌ)।

మేదకః-జగలః॥పు॥ ౨ - మద్యము సేయుటకు నానాద్రవ్యములుగూర్చినముద్దపేళ్లు.

సంధానంస్యా దభిషవః

సంధానమ్॥న॥-అభిషవః॥పు॥ ౨-కల్లుసేయుటపేళ్లు. Distillation.

కిణ్వం(పుంసితు)నగ్న
హూః॥ ౭౪॥

కిణ్వమ్॥న॥-నగ్నహూః[పు]నగ్నహూః॥పు॥౨-మద్యము సేయుమొలకపేళ్లు. నానాద్రవ్యకృతసురాబీజము. Ferment.

కారోత్తర స్సురామణ్డ

కారోత్తరః॥ పు॥-సురామణ్డమ్॥ న॥ ౨-కల్లు

తేఁటపేళ్లు. Yest, froth.

మాపానం పానగోష్ఠికా ।

ఆపానమ్॥న॥- పానగోష్ఠికా॥స్త్రీ॥ ౨ - అనేకులుకూడి మద్యపానము సేయుచోటిపేళ్లు. A place where people drink together.

చషకో(ఽస్త్రీ) పానపాత్రం సరకోఽప్యనుతర్షణమ్॥ ౨౩౧॥

చషకః॥పు॥-పానపాత్రమ్॥న॥ - సరకః॥(ఇది అపిశబ్దము చేత)॥పు॥-అనుతర్షణమ్॥ న॥ ౪-కల్లు [త్రాగుగిన్నె పేళ్లు. A drinking vessel. సరకాను తర్షణశబ్దములు ౨-ను మద్యమువడ్డించుట పేళ్లని కొందఱు. Distribution of liquor.

ధూర్తోఽక్షదేవీ కితవోఽక్షధూర్తో ద్యూతకృత్సమాః ।

ధూర్తః- అక్షదేవీ॥న్॥-కితవః-అక్షధూర్తః-ద్యూతకృత్॥ త్,పు॥ ౫-జూదమాడువాని పేళ్లు. A gamester.

స్యుర్లగ్నకాః ప్రతిభువః

లగ్నకః - ప్రతిభూః॥పు॥ ౨-పూటపడువాని [పేళ్లు. Surety.

సభికా ద్యూతకారకాః॥ ౨౩౨॥

సభికః-ద్యూతకారకః॥ పు॥ ౨-జూదమాడించువాని పేళ్లు. Keeper of a gaming house.

ద్యూతోఽ(ఽస్త్రియాం)మక్షవతీ కైతవం పణ (ఇత్యపి) ।

ద్యూతః॥పు॥-అక్షవతీ॥స్త్రీ॥-కైతవమ్॥న॥-పణః॥పు॥౪-జూదముపేళ్లు. Gaming.

పణో (ఽక్షేషు) గ్లహాః

పణః-గ్లహః॥ పు॥ ౨-అక్షేషు = జూదములయందలి, పణః=పందెముపేరు. A stake. Wager.

అక్షాస్తు దేవనాః పాశకాశ్చ తే॥ ౨౩౩॥

అక్షః-దేవనః[పా]దేవకః-పాశకః॥పు॥ ౩-పాచికలపేళ్లు. Dice.

పరిణాయ (స్తుశారీణాం సమన్తాన్నయనే)ఽ (స్త్రియాం) ।

పరిణాయః॥పు॥౧-శారీణామ్=సారెలయొక్క, సమన్తాత్ = అంతట, నయనే=నడుపుటయందు వర్తించును. Moving a piece at play.

అష్టాపదం శారిఫలం

అష్టాపదమ్-శారిఫలమ్॥పు॥ ౨-జూదమాడుపలక. A checkered board or cloth.

ప్రాణిద్యూతం సమాహ్వయః॥ ౨౩౪॥

ప్రాణిద్యూతమ్॥న॥-సమాహ్వయః॥పు॥౨కోడిపందెము మొదలైనవానిపేళ్లు. A match of cocks &c.

మూ॥ ఉక్తా భూరిప్రయోగత్వా దేకస్మి న్యేఽత్ర యౌగికాః।
తాద్ధర్మ్యా దన్యతో వృత్తా వూహ్యా లిఙ్గాన్తరేఽపి తే॥ 23౫॥

టీక॥ అత్ర = ఈ శూద్రవర్గయందు, యౌగికాః = యౌగికములైన, యే = ఏమాలాకార మాగధకాశ్మీరాది శబ్దములు, భూరిప్రయోగత్వాత్ = ప్రయోగబాహుళ్యమువలన, ఏకస్మిన్ = ఒక పుంలింగమునందు, ఉక్తాః = చెప్పంబడినవో, తే = ఆశబ్దములు, తాద్ధర్మ్యాత్ = ఆయాధర్మములు గలుగుటవలన, అన్యతః = స్త్ర్యాదులయందు, వృత్తాః = వర్తించుచున్నవై, లిఙ్గాన్తరేఽపి = స్త్రీలింగ నపుంసక లింగముల యందును వర్తించుచున్నవి యని, ఊహ్యాః = తెలియందగినవి.

యౌగికములయి జాతివాచకములైన కుంభకారాదిశబ్దములు శూద్రాదిశబ్దములవలె పుంలింగస్త్రీలింగములయందునువర్తించుచున్న వనుట. ఉదాహరణము: మాలాకారః పురుషః - మాలాకారీ స్త్రీ - మాలాకారం బృన్దమ్. ఇత్యాదులు.

ఇతిశూద్రవర్గః = శూద్రులలోఁ జేరిన పదసమూహము ముగిసెను.

మూ॥ ఇత్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే।
భూమ్యాదికాణ్డో ద్వితీయః సాఙ్గఏవ సమర్థితః॥ 23౬॥

టీక॥ ఇతి = ఈ పూర్వోక్తమయిన, నామలిఙ్గానుశాసనే = నామలింగానుశాసనమను, అమరసింహకృతౌ = అమరసింహుని గ్రంథమునందు, ద్వితీయః = రెండవదయిన, భూమ్యాదికాణ్డః = భూమి మొదలైనవానిని దెలియఁజెప్పుభాగము, సాఙ్గఏవ = సమగ్రముగానే, సమర్థితః = నెరవేర్పంబడెను.

నామలింగానుశాసనము - ద్వితీయ కాండము.

సంపూర్ణము.

# అమరకోశము - ద్వితీయకాండము.

## ప ర్యా య ప ద శే ష ము.

శ్లో.

57. అవరోహః = A fibrous root from a radicant branch ; A scandent plant climbing from the root to the top of a tree.

91. నదీసర్జః = Terminalia Alata glabra.

121. కురణ్టకః=Barleria prionitis.

125. పర్ణాసః=Ocimum sanctum.
అర్జకః = Ocimum gratissimum.

163. గాంగేరుకీ = The sharp angled cucumber.

172. వితున్నకః=The dwarf myrobalan.

183. ఋశ్యగన్ధా=Osyris Peltata.

184. హయపుచ్ఛీ=Phaseolus minimus.

202. చిత్రా=Bryonia callosa.

203. గండీరః = Solanum speciosum.

240. రాజహంసః=A white gander with red legs and bill.

241. మల్లికః = —— with brown legs and bill.
ధార్తరాష్ట్రః=——with black legs and bill.
శరాటిః = Turdus ginginianus.

277. కాత్యాయనీ = A middle aged widow wearing a dress indicating the practice of austerity.

278. సైరంధ్రీ=A woman living in another's house and practising any art.
అసిక్నీ = A young maid-servant of the harem.

శ్లో.

279. వారముఖ్యా=The head of a set of harlots.

290. యాతా = Husband's brother's wife.

363. బాలపాశ్యా = An ornament for the hair.

పత్రపాశ్యా = —— for the forehead.

406. ఆదేష్టా = An employer of priests to perform a sacrifice.

407. ఇజ్యాశీలః = One who frequently sacrifices.

409. అనూచానః = One who is completely learned in sacred knowledge.

సమావృత్తః = One who has taken leave of his preceptor to become a householder.

418. దక్షిణాగ్నిః = A fire taken from the consecrated one, or from a domestic fire, and placed towards the south.

గార్హపత్యః=The fire perpetually maintained by a householder.

శ్లో.

ఆహవనీయః = Fire thence taken and prepared for receiving oblations: a consecrated fire.

ఆనాయ్యః = The southern fire taken from the householder's hearth and consecrated.

420. అగ్నాయీ = A goddess presiding over the prayers with which burnt-offerings are made.

424. పరమాన్నం=An oblation of rice, milk and sugar.

425. ధ్రువా = A vessel shaped like an Indian fig-leaf and made of the wood of Flacourtia sapida.

ఉపభృత్ = A round vessel made of the wood of a holy fig-tree.

జుహూః = A semi-circular vessel made of the wood of Butea.

శ్లో.

స్రువః=A ladle made of the wood of Mimosa Catechu.

428. అమృతమ్= Butter &c remaining of a sacrifice.

విఘసః = Residue of food offered to the gods, to the manes, to a spiritual parent &c.

431. శ్రాద్ధం=Funeral repast; feeding of priests and other prescribed ceremonies in honor of ancestors.

432. ఆతిథ్యం = (Proper for a guest) Hospitality.

439. బ్రహ్మాంజలిః=A holy posture adapted to meditation and restraint of thought.

446. బృసీ=A seat made of *kusa* grass.

447. సుత్యా=Extracting the juice of acid asclepias.

456. పరివేత్తా = One married before his elder brother.

555. వైతాలికాః = Those whose business it is to awaken the prince at dawn with music and song.

శ్లో.

584. యవ్యమ్ = A field fit for producing barley.

యవక్యమ్= — for forced rice.

షష్టిక్యమ్ = — for quick-growing rice.

585. తిల్యమ్=— for sesamum.

మాష్యమ్=—black kidney beans.

అణవ్యమ్=—for panic seed.

భంగ్యమ్=—for hemp.

641. యుగ్యః=An ox yoked.

ప్రాసంగ్యః=An ox in training with a frame on his neck.

శాకటః = A ox trained to draught.

652. కుటరః = The post round which the string of the churning-stick passes.

653. శృంఖలకాః=Young camels clogged with wooden rings on their feet.

శ్లో.

654. ఔష్ట్రకం=A herd of camels.

ఔరభ్రకం=A flock of sheep.

ఆజకమ్=A flock of goats.

699. దేవాజీవః=A low Brahmana subsisting by attendance upon an idol and upon the offerings made to it.

709. కిరాతః = A mountaineer wearing feathers and armed with a bow.

శబరః = A savage wearing leaves.

శ్లో.

పులిందః= A mountaineer speaking no intellgible language.

728. అవదంశః=Anything which excites thirst or appetite.

730. మైరేయం = Rum distilled from blossoms of Lythrum fruticosum, with sugar &c.

ఆసవః = —— from the raw juice of sugar-cane.

శీధుః= —— from molasses.

మేదకః = Vinous liquor for distilling.



శ్రీ ర స్తు.

# సటీక నామలింగానుశాసనము.

## తృ తీ య కా ౦ డ ము.

గ్రంథకర్త చదువువారికి సులభముగాఁ దెలియుటకై యీనానార్థ న్యకాండమునఁ జెప్పఁగలవర్గలను వానికిఁ బూర్వ కాండములయందుఁ జెప్పఁబడిన వర్గలతోఁగల సంబంధమును జెప్పుచున్నాఁడు.

మూ॥ విశేష్యనిఘ్నైః సంకీర్ణై ర్నానార్థై రవ్యయై రపి।
లిఙ్గాదిసంగ్రహై ర్వర్గాః సామాన్యే వర్గసంశ్రయాః॥

టీక॥ సామాన్యే=పూర్వకాండములకు సాధారణమైన యీసామాన్యకాండమునందు, విశేష్యనిఘ్నైః=విశేష్యముతో సమాసమైన లింగాదులుగల పదముల చేతను, సంకీర్ణైః=పరస్పరవిరుద్ధములై నకర్మపారాయణపరస్పర ప్రభృతిశబ్దముల చేతను, నానార్థైః=అనేకార్థములయినపదముల చేతను, అవ్యయైరపి=అవ్యయపదములచేతను, లిఙ్గాదిసంగ్రహైః=లింగసంగ్రహనామసంగ్రహముల చేతను, వర్గాః=విశేష్యనిఘ్న సంకీర్ణ నానార్థ అవ్యయ లింగాదిసంగ్రహము లనునైదువర్గలు, ఉచ్యన్తే=చెప్పఁబడుచున్నవి. తే=ఆవర్గలు, వర్గసంశ్రయాః=ప్రథమద్వితీయకాండవర్గలనే యాశ్రయించినవి. తఱుచుగాఁ దమలో నవాంతరవర్గలు గలవియనిగాని యర్థము.

అదియెట్లనఁగా విశేష్యనిఘ్నవర్గయందుఁజెప్పఁగల సుకృత్యాదులు స్వర్గాదివిశేషణములును సంకీర్ణవర్గయందుఁజెప్పఁగలకర్మాదులును వాని వ్యాపారములును ఇట్లు కడమవర్గలయందుఁ జెప్పఁగల పదార్థములకును వానితోసంబంధము దెలియవచ్చును కావున నీకాండము సామాన్యకాండమనిపించుకొనును. రెండవపక్షము—నానార్థవర్గయందు కాంతాదివర్గలును అవ్యయవర్గయందవ్యయవర్గావ్యయ నానార్థవర్గలును నిట్లే లింగాదిసంగ్రహావర్గయందునున్నవని తెలియవలయును.

ఈశాస్త్రమున "ప్రాయశోరూపభేదేన" అను సంకేతముచేత తఱుచుగా రూపభేదముచేత లింగ మెఱుఁగఁదగినది గనుక నీవిశేష్యనిఘ్న వర్గయందు నట్టి సంకేతము లేదని జెప్పుచున్నాఁడు.

మూ॥ స్త్రీదారాద్యైర్యద్విశేష్యం యాదృశైః ప్రస్తుతం పదైః।
గుణద్రవ్యక్రియాశబ్దా స్తథా స్యు స్తస్య భేదకాః॥ ౧॥

టీక॥ యద్విశేష్యమ్=ఏవిశేష్యమయినయర్థము, యాదృశైః=ఏలింగాదులుగల, స్త్రీదారాద్యైః పదైః=స్త్రీ దార మొదలయిన స్త్రీలింగపులింగనపుంసకలింగపదములచేతను, ప్రస్తుతమ్=ప్రక్రమింపఁబడునో, తస్య=ఆవిశేష్యమునకు, భేదకాః=విశేషణములయిన, గుణద్రవ్యక్రియాశబ్దాః=గుణద్రవ్యక్రియావాచకశబ్దములు, తథాస్యుః = ఆవిశేష్యలింగాదులుగలవే యౌను.

అనఁగా, విశేష్యము ఏలింగముగా ప్రక్రమింపఁబడునో గుణద్రవ్యక్రియావాచకములయిన సుకృత్యాదివిశేషణములును ఆలింగములుగలవే యౌనని తాత్పర్యము. ప్రవీణా స్త్రీ - ప్రవీణాః దారాః - ప్రవీణం కళత్రమ్, అని గుణవాచక విశేషణములకును, ధనినీ స్త్రీ-ధనినో దారాః-ధని కళత్రమ్ అని ద్రవ్యవాచకవిశేషణములకును, క్షేమంకరా స్త్రీ -క్షేమంకరా దారాః-క్షేమంకరం కళత్రమ్ అని క్రియావాచకవిశేషణములకును దాహరణములు.

| | |
|---|---|
| [క్షేమంకరోఽరిష్టతాతి శ్శివతాతి శ్శివంకరః।] | క్షేమంకరః- అరిష్టతాతిః - శివతాతిః-శివంకరః॥ ౪ - శుభమును జేయువాని పేళ్లు. ఈయర్థశ్లోకమును ప్రక్షిప్తమనికొందఱు. Propitious. |
| సుకృతీ పుణ్యవా న్ధన్యో | సుకృతీ॥న్॥-పుణ్యవాన్॥ త్॥ - ధన్యః॥ ౩-పుణ్యముగలవాని పేళ్లు. Well-fated. Fortunate. |
| మహేచ్ఛస్తు మహాశయః॥ Magnanimous. | మహేచ్ఛః-మహాశయః॥ ౨-ఘనమైన మనస్సుగలవాని పేళ్లు. విరివియైన మనస్సుగలవాఁడు. |
| హృదయాలు స్సుహృదయో | హృదయాలుః-సుహృదయః॥ ౨-మంచి మనస్సుగలవాని పేళ్లు. Good-hearted |
| మహోత్సాహో మహోద్యమః। Persistant. | మహోత్సాహః-మహోద్యమః॥ ౨-దుష్కర ప్రయోజనములయందు దుద్యోగము గలవాని పేళ్లు. Perseverant; diligent. |

| | |
|---|---|
| ప్రవీణే నిపుణాభిజ్ఞ విజ్ఞ నిష్ణాత శిక్షితాః॥౪॥ వైజ్ఞానికః కృతముఖః కృతీ కుశల (ఇత్యపి)। | ప్రవీణః - నిపుణః - అభిజ్ఞః - విజ్ఞః-నిష్ణాతః-శిక్షితః-వైజ్ఞానికః[పా]విజ్ఞానికః-కృతముఖః-కృతీ॥న్॥-కుశలః-౧౦-నేర్పరిపేళ్లు.Skilful; conversant. |
| పూజ్యః ప్రతీక్ష్య | పూజ్యః-ప్రతీక్ష్యః॥౨-పూజ్యునిపేళ్లు. Venerable. |
| సాంశయిక స్సంశయాపన్నమానసః॥౫॥ | సాంశయికః - సంశయాపన్నమానసః॥ ౨- సందేహించువానిపేళ్లు. Irresolute; సంశయించిన వస్తువుపేళ్లని కొందఱందురు. Uncertain. |
| దక్షిణీయో దక్షిణార్హ(స్తత్ర)దాక్షిణ్య (ఇత్యపి)। | దక్షిణీయః - దక్షిణార్హః - దాక్షిణ్యః[పా] దక్షిణ్యః॥ ౩-దక్షిణకు యోగ్యమయినవానిపేళ్లు. Meriting a reward. |
| (స్యు)ర్వదాన్యస్థూలలక్ష దానశౌణ్డా బహుప్రదే॥ ౬॥ | వదాన్యః - స్థూలలక్షః [పా] స్థూలలక్ష్యః-దానశౌణ్డః - బహుప్రదః॥ ౪ - మిక్కిలి యిచ్చువానిపేళ్లు. Munificent. |
| జైవాతృక (స్స్యా)దాయుష్మా | జైవాతృకః-ఆయుష్మాన్॥ త్॥ ౨- దీర్ఘాయుష్మంతునిపేళ్లు. Long-lived. |
| న్నన్తర్వాణిస్తు శాస్త్రవిత్। | అన్తర్వాణిః-శాస్త్రవిత్॥ ద్॥ ౨-శాస్త్రమునెఱింగినవానిపేళ్లు. Skilled in sacred sciences. |
| పరీక్షకః కారణికో | పరీక్షకః-కారణికః॥ ౨ - ప్రమాణములచేత నర్థమును నిశ్చయించువానిపేళ్లు. Investigating. |
| వరదస్తు సమర్ధకః॥౭॥ | వరదః-సమర్ధకః॥ ౨. అడిగిన వస్తువులనిచ్చు దేవతాదులపేళ్లు. Granting a prayer. |
| హర్షమాణో వికుర్వాణః ప్రమనా హృష్టమానసః। | హర్షమాణః-వికుర్వాణః-ప్రమనాః॥స్॥-హృష్టమానసః॥౪-సంతోషముతోఁ గూడిన మనస్సుగలవానిపేళ్లు. Joyful, cheerful. |
| దుర్మనా విమనా అన్తర్మనా (స్స్యా) | దుర్మనాః॥స్॥-విమనాః॥స్॥ -అన్తర్మనాః॥స్॥ ౩. దుఃఖముతోఁ గూడిన మనస్సుగలవాని పేళ్లు. Sad; perplexed. |
| దుత్క ఉన్మనాః॥౮॥ | ఉత్కః-ఉన్మనాః॥స్॥ ౨ - ప్రియమయినవస్తు |

| | |
|---|---|
| | నెప్పుడు దొరుకునాయని త్వరగలవానిపేళ్లు. Anxiously wishing for. |
| దక్షిణే సరలోదారౌ | దక్షిణః-సరలః - ఉదారః॥ ౩-కుటిలముగాక చక్కనైనమనస్సుగలవానిపేళ్లు. Sincere, candid. |
| సుకలో (దాతృభోక్తరి)। | సుకలః॥ ౧-దాతృభోక్తరి=త్యాగభోగములు గలవానిపేరు. Liberal in giving and using. |
| తత్పరే ప్రసితాఽసక్తౌ | తత్పరః-ప్రసితః-ఆసక్తః॥ ౩-ఒక పదార్థము నందుఁదగిలిన మనస్సుగలవానిపేళ్లు. Attentive. Closely intent on. |
| ఇష్టార్థోద్యుక్త ఉత్సుకః॥ ౯॥ | ఇష్టార్థోద్యుక్తః- ఉత్సుకః ॥ ౨ - ఇష్టమైన ప్రయోజనమునం దుద్యోగము గలవాని పేరు. Zealously active. Anxiously striving for. |
| ప్రతీతే ప్రథిత ఖ్యాత విత్తవిజ్ఞాత విశ్రుతాః। | ప్రతీతః-ప్రథితః- ఖ్యాతః - విత్తః-విజ్ఞాతః-విశ్రుతః॥ ౬ - ధనాదులచేఁబ్రసిద్ధుండయినవాని పేళ్లు. Celebrated, famous. |
| (గుణైః ప్రతీతే తు) కృతలక్షణాఽఽహతలక్షణౌ॥ ౧౦॥ | కృతలక్షణః-ఆహతలక్షణః॥ ౨-గుణైః=త్యాగశౌర్యాదిగుణములచేత, ప్రతీతే=ప్రసిద్ధుఁడయినవానిపేళ్లు. Noted for good qualities. |
| ఇభ్య ఆఢ్యో ధనీ | ఇభ్యః-ఆఢ్యః-ధనీ॥ న్ ॥ ౩ - ధనికునిపేళ్లు. Opulent, wealthy. |
| స్వామీత్వీశ్వరః పతి రీశితాఽధిభూర్నాయకో నేతా ప్రభుః పరివృఢోఽధిపః॥ ౧౧॥ | స్వామీ॥న్॥- ఈశ్వరః- పతిః- ఈశితా॥ఋ॥ - అధిభూః-నాయకః- నేతా॥ఋ॥- ప్రభుః-పరివృఢః- అధిపః॥౧౦-ఏలువాని పేళ్లు, An owner or master. |
| అధికర్ధిస్సమృద్ధస్స్యాత్ Prosperous. | అధికర్ధిః-సమృద్ధః [పా] సమృద్ధిః॥౨- అధిక సంపదగలవానిపేళ్లు. Every way happy. |
| కుటుమ్బవ్యాపృతస్తుయః। స్యాదభ్యాగారిక(స్తస్మి)న్నుపాధి(శ్చ పుమానయమ్)॥౧౨॥ | కుటుంబవ్యాపృతః- అభ్యాగారికః - ఉపాధిః॥ ఈ ౩ కుటుంబపోషణము నందాసక్తుఁడై యుండువానిపేళ్లు. Attentive to support his family. ఉపాధిశబ్దము నియతపుల్లింగము. |

(వరాఙ్గరూపోపేతో
యః) స్సింహసంహననో
(హి నః)।

సింహసంహననః॥౧-వరాఙ్గరూపోపేతః=శ్రేష్ఠ
మయిన యంగముతోను రూపముతోను గూడు
కొన్న వానిపేరు. Handsome and well-shaped.

నిర్వార్యః కార్యకర్తా
య స్సమ్పన్న స్సత్త్వ
సమ్పదా)॥　　౧౩॥
Acting fearlessly.

నిర్వార్యః[పా]నిర్వార్యః॥ ౧-సత్త్వసమ్పదా=
ఆపదలయందును కలతనొందని ధైర్యసంపదతో,
సమ్పన్నః=కూడుకొన్నవాఁడై, యః=ఎవఁడు, కా
ర్యకర్తా=కార్యమును జేయునో, సః=వానిపేరు.

అవాచి మూకో౽
అవాక్-మూకః॥౨-మూఁగవానిపేరు. Dumb.

థ మనోజవసః (పితృ
సన్నిభః)।

మనోజవసః[ప] మనోజవః-పితృసన్నిభః॥౨-
తండ్రినిబోలినవానిపేరు. Fatherly.

(సత్కృ త్యాలంకృ
తాం కన్యాం యో ద
దాతి స)కూకుదః॥౧౪॥

కూకుదః॥౧-యః=ఎవఁడు, సత్కృత్య=సత్క
రించి, అలంకృతామ్ = అలంకరింపఁబడిన, క
న్యామ్=కన్యకను, దదాతి = దానముచేయుచు
న్నాఁడో, సః=వానిపేరు. One who gives a girl
in marriage decorating her with ornaments.

లక్ష్మీవాన్ లక్ష్మణః
శ్రీలః శ్రీమాన్

లక్ష్మీవాన్॥ త్॥-లక్ష్మణః-శ్రీలః[పా]శ్లీలః-శ్రీ
మాన్॥త్॥౪ - సంపదగలవానికిని ఒప్పిదముఁగల
వానికిని పేళ్లు. Prosperous, happy. [Affectionate.

స్నిగ్ధ స్తు వత్సలః।

స్నిగ్ధః-వత్సలః॥౨-స్నేహముగలవాని పేళ్లు.

(స్యా) ద్దయాలుః కా
రుణికః కృపాలుస్సూర
తః(సమాః)　　॥౧౫॥

దయాలుః-కారుణికః-కృపాలుః-సూరతః॥౪-
దయగలవానిపేళ్లు. Compassionate.

స్వతన్త్రో౽ పావృత
స్స్వైరీ స్వచ్ఛన్దో నిర
వగ్రహః।

స్వతన్త్రః-అపావృతః-స్వైరీ॥న్॥[పా]స్వైరః-
స్వచ్ఛన్దః-నిరవగ్రహః॥౫-స్వతంత్రుని పేళ్లు. Unre-
strained. Independent.

పరతన్త్రః పరాధీనః
పరవా న్నాథవానపి॥
౧౬॥ అధీనో నిఘ్న ఆ
యత్తో౽ స్వచ్ఛన్దో

పరతన్త్రః-పరాధీనః-పరవాన్॥త్॥ - నాథ
వాన్॥త్॥ ౪ - పరాధీనునిపేళ్లు. Dependent. అధీ
నః-నిఘ్నః-ఆయత్తః-అస్వచ్ఛన్దః- గృహ్యకః॥౫-
అధీనునిపేళ్లు. Docile. ఈ యు పర్యాయములని

గృహ్యకోఽ(ప్యథా)।
ఖలపూ (స్స్యా) ద్బహుకరో
దీర్ఘసూత్రశ్చిరక్రియః॥ ౧౭॥
జాల్మోఽసమీక్ష్యకారీ(స్యా)
త్కుణ్ఠో (మన్దః క్రియాసు యః)।
కర్మక్షమోఽలంకర్మీణః
క్రియావాన్ (కర్మసూద్యతః)॥ ౧౮॥
స కార్మః కర్మశీలో (యః) Laborious.
కర్మశూరస్తు కర్మఠః। Finishing carefully.
(కర్మణ్యభుక్ కర్మకరః) Working for hire.
కర్మకార (స్తుతత్క్రియః)॥ ౧౯॥
అపస్నాతో మృతస్నాత
ఆమిషాశీ తు శౌష్కలః।
బుభుక్షిత(స్స్యాత్)క్షుధితో జిఘత్సు రశనాయితః॥ ౨౦॥

కొందఱు.

ఖలపూః-బహుకరః॥ ౨ - కళ్లమునూడ్చువాని పేళ్లు. A sweeper.

దీర్ఘసూత్రః-చిరక్రియః॥ ౨-విచారించి మెల్లగా కార్యముఁ జేయువాని పేళ్లు. Dilatory, slow.

జాల్మః-అసమీక్ష్యకారీ॥న్॥ ౨-విచారింపక కార్యముఁ జేయువాఁడు. Acting inconsiderately.

కుణ్ఠః॥ ౧ - కార్యములయందు అలసుఁడైనవాని పేరు. Indolent.

కర్మక్షమః-అలంకర్మీణః॥ ౨-కార్యమును జేయ సమర్థుఁడైనవాని పేళ్లు. Competent to act.

క్రియావాన్ ॥త్॥ ౧- కార్యమును జేయ నుద్యోగించినవాని పేరు. Engaged in a business.

కార్మః-కర్మశీలః॥ ౨ - ఫలముగలిగినను లేకున్నను కార్యముఁ జేయు స్వభావముగలవాని పేళ్లు.

కర్మశూరః-కర్మఠః॥ ౨-ఫలముగలుగువఱకును కార్యముఁ జేయ తెగువగలవాని పేళ్లు.

కర్మణ్యభుక్(పా) భరణ్యభుక్ ॥జ్॥-కర్మకరః॥ ౨-కూలిపుచ్చుకొని పని చేయువాని పేరు.

కర్మకారః॥ ౧-తత్క్రియః = కూలిలేక పని చేయువాని పేరు. Working without wages.

అపస్నాతః-మృతస్నాతః॥ ౨ - బంధుసుహృదాది మరణనిమిత్తమయి స్నానము చేసినవాని పేళ్లు. Bathing after mourning.

ఆమిషాశీ॥న్॥-శౌష్కలః॥ ౨-మత్స్యమాంసములఁదినువాని పేళ్లు. Eating fish and flesh.

బుభుక్షితః-క్షుధితః-జిఘత్సుః-అశనాయితః॥ ౪-ఆఁకలిగొన్నవాని పేళ్లు. Hungry.

| | |
|---|---|
| పరాన్నః పరపిణ్డాదో | పరాన్నః-పరపిణ్డాదః॥౨ - పరాన్నమేభుజించువాని పేళ్లు. Feeding at another's cost. |
| భక్షకో ఘస్మరోఽద్మరః। | భక్షకః-ఘస్మరః-అద్మరః॥౩-తిండిపోతుపేళ్లు. Gluttonous. |
| ఆద్యూన(స్స్యా)దౌదరికో(విజిగీషావివర్జితే)॥ | ఆద్యూనః-ఔదరికః॥ ౨ -విజిగీషావివర్జితే=వేఱేయుద్యోగములేక పొట్టపోసికొనువాని పేళ్లు. Shamelessly voracious. |
| (ఉభౌ) వాత్మమ్భరిః కుక్షిమ్భరి (స్స్వోదరపూరకే)। | ఆత్మమ్భరిః-కుక్షిమ్భరిః॥ఈ౨- ను పోష్యవర్గమునువిడిచి, స్వోదరపూరకే=తనకడుపునేనించుకొనువాని పేళ్లు. Selfishly voracious. |
| సర్వాన్నీనస్తు సర్వాన్నభోజీ | సర్వాన్నీనః - సర్వాన్నభోజీ॥న్॥౨-నియమములేక యన్నితావులఁభుజించువాని పేళ్లు. Eating all manner of food. |
| గృధ్నుస్తుగర్ధనః॥౨౨ లుబ్ధోఽభిలాషుకస్తృష్ణక్ | గృధ్నుః - గర్ధనః - లుబ్ధః- అభిలాషుకః - తృష్ణక్॥జ్॥౫-ఆశగలవాని పేళ్లు. Covetous, greedy. |
| (సమౌ) లోలుప లోలుభౌ। | లోలుపః - లోలుభః॥ ౨- మిక్కిలియునాశగలవాని పేళ్లు. Very covetous. |
| సోన్మాద స్తూన్మదిష్ణు (స్స్యా) Frantic. | సోన్మాదః - ఉన్మదిష్ణుః॥ ౨ - భూతావేశాదులచేత నొడలెఱుఁగనివాని పేళ్లు. Mad, insane. |
| దవినీత స్సముద్ధతః॥౨౩॥ | అవినీతః- సముద్ధతః॥ ౨-వినయములేనివాని పేళ్లు. Misbehaving. |
| మత్తే శౌణ్డోత్కటక్షీబాః Intoxicated. | మత్తః - శౌణ్డః - ఉత్కటః-క్షీబః॥౪- మద్యపానాదులచేత నొడలెఱుఁగనివాని పేళ్లు. Drunk. |
| కాముకే కమితాఽనుకః। కమ్రః కామయితాఽభీకః కమనః కామనోఽభికః॥ ౨౪॥ | కాముకః - కమితా॥ఋ॥ - అనుకః - కమ్రః-కామయితా॥ఋ॥-అభీకః - కమనః - కామనః-అభికః॥౯ - కామునిపేళ్లు. కోరికగలవాఁడు. Lustful. |
| విధేయో వినయగ్రాహీ | విధేయః - వినయగ్రాహీ ॥ న్ ॥-వచనేస్థితః- |

| | |
|---|---|
| వచనేస్థిత ఆశ్రవః। | ఆశ్రవః॥౧-చెప్పినట్టుచేయువాఁడు. Compliant. |
| వశ్యః ప్రణేయో Under influence. | వశ్యః-ప్రణేయః॥౨ - ఔషధాదులచేతవశ్యమయినవానిపేళ్లు. Governable. |
| నిభృత వినీత ప్రశ్రితా (స్సమాః)॥ ౨౫॥ | నిభృతః - వినీతః - ప్రశ్రితః [పా] ప్రసృతః-3-శిక్షింపఁబడినవానిపేళ్లు. well trained. |
| ధృష్టే ధృష్ణుర్వియాతశ్చ shameless. | ధృష్టః - ధృష్ణుః(పా)ధృష్ణక్॥జ్॥-వియాతః॥3-దిట్టతనముగలవానిపేళ్లు. Impudent. |
| ప్రగల్భః ప్రతిభాన్వితే। | ప్రగల్భః - ప్రతిభాన్వితః॥౨ - అప్పటప్పటికి క్రొత్తగా ప్రకాశించు ప్రజ్ఞగలవానిపేళ్లు. Endowed with genius; bold. |
| (స్యా)దధృష్టే తు శాలీనో | అధృష్టః-శాలీనః॥౨ - దిట్టతనము లేనివానిపేళ్లు. Modest ; Retiring. |
| విలక్షో విస్మయాన్వితే॥ Astonished. ౨౬॥ | విలక్షః-విస్మయాన్వితః॥౨-ఆశ్చర్యముచే ప్రకృతార్థజ్ఞానములేనివానిపేళ్లు. వెఱఁగుపడినవాఁడు. |
| అధీరే కాతర | అధీరః- కాతరః॥౨- వ్యసనాదులచేత వ్యాకులపడినవానిపేళ్లు. Confused. |
| స్త్రస్నౌ భీరు భీరుక భీలుకాః। | త్రస్నుః-(పా)త్రస్తః- భీరుః- భీరుకః-భీలుకః॥౪- వెఱచు స్వభావముగలవానిపేళ్లు. Timid. |
| ఆశంసు రాశంసితరి | ఆశంసుః- ఆశంసితా॥ఋ॥౨- ప్రియవస్తువు కోరువాని పేళ్లు. Desirous. |
| గృహయాలు ర్గ్రహీతరి॥ ౨౭॥ | గృహయాలుః-గ్రహీతా॥ఋ॥౨ - పుచ్చుకొనుస్వభావముగలవానిపేళ్లు. Disposed to take. |
| శ్రద్ధాలుః (శ్రద్ధయా యుక్తే) | శ్రద్ధాలుః॥౧- శ్రద్ధయా=నమ్మికతో, యుక్తే=కూడియున్న వానిపేరు. Believing. |
| పతయాలు స్తుపాతుకే। | పతయాలుః-పాతుకః॥౨ - పడుస్వభావముగలవానిపేళ్లు. Habitually falling. |
| లజ్జాశీలే ఽపత్రపిష్ణు | లజ్జాశీలః - అపత్రపిష్ణుః॥ ౨ - సిగ్గుపడుస్వభావముగలవానిపేళ్లు. Bashful. |
| ర్వన్దారు రభివాదకే॥ | వన్దారుః - అభివాదకః॥ ౨ - మ్రొక్కుస్వ |

| | |
|---|---|
| ౨౮॥ | భావముగలవాని పేళ్లు. Polite; respectful. |
| శరారుర్ఘాతుకో హింస్రః | శరారుః-ఘాతుకః-హింస్రః॥౩ - చంపుస్వభావముగలవాని పేళ్లు. Destructive, mischievious. |
| (స్యా)ద్వర్ధిష్ణు స్తువర్ధనః। | వర్ధిష్ణుః-వర్ధనః॥౨- వృద్ధిఁబొందుస్వభావముగలవానిపేళ్లు. Thriving; growing. |
| ఉత్పతిష్ణు స్తూత్పతితా౽ | ఉత్పతిష్ణుః-ఉత్పతితా॥ఋ॥ ౨ - ఎగయుస్వభావముగలవానిపేళ్లు. Jumping up. |
| లంకరిష్ణుస్తు మణ్డనః॥ ౨౯॥ | అలంకరిష్ణుః - మణ్డనః॥౨ - శృంగారించుస్వభావముగలవానిపేళ్లు. Fond of ornaments. |
| భూష్ణు ర్భవిష్ణు ర్భవితా | భూష్ణుః- భవిష్ణుః- భవితా॥ఋ॥ ౩- కాఁగలవానిపేళ్లు. About to become. పలుమాఱును మొలుచుస్వభావముగల కేశనఖాదులపేళ్లని కొందఱు. |
| వర్తిష్ణు ర్వర్తన (స్స మౌ)। | వర్తిష్ణుః-వర్తనః॥ ౨-వర్తించు స్వభావముగలవానిపేళ్లు. Revolving; stationary; abiding. |
| నిరాకరిష్ణుః క్షిప్నుః (స్యాత్) | నిరాకరిష్ణుః-క్షిప్నుః॥ ౨-తిరస్కరించుస్వభావముగలవానిపేళ్లు. Disdaining; obstructive. |
| (సాన్ద్రి) స్నిగ్ధ స్తు) మేదురః॥ ౩౦॥ | మేదురః॥ ౧ - సాన్ద్రి = దట్టమయి, స్నిగ్ధః = నిగ్గుగలిగినమేఘపటలాదుల పేరు. Thick with. |
| జ్ఞాతాతు విదురో విన్దు | జ్ఞాతా॥ఋ॥-విదురః-విన్దుః॥౩-ఎఱుఁగు స్వభావముగలవానిపేళ్లు. Intelligent. Knowing. |
| ర్వికాసీ తు వికస్వరః। | వికాసీ॥న్॥-వికస్వరః॥౨ - వికసించుస్వభావముగలదానిపేళ్లు. Expanding. |
| విసృత్వరో విస్మమరః ప్రసారీచవిసారిణి॥ ౩౦॥ | విసృత్వరః-విస్మమరః-ప్రసారీ॥న్॥-విసారీ॥న్॥ ౪-నెఱయుస్వభావముగల నీళ్లమీఁది తైలబిందువులు మొదలయినదానిపేళ్లు. Spreading, creeping. |
| సహిష్ణు స్సహనః క్షన్తా తితిక్షుః క్షమితా క్షమీ। | సహిష్ణుః-సహనః-క్షన్తా॥ఋ॥-తితిక్షుః-క్షమితా॥ఋ॥-క్షమీ॥౬- స్వభావము చేత నోర్పుగలవానిపేళ్లు. Patient; content. |
| క్రోధనో౽మర్షణఃకోపీ | క్రోధనః॥-అమర్షణః-కోపీ॥న్॥౩- స్వభావము |

fragrancy; pride. — నకును, మదశబ్దము గర్వమునకును పేరు.

(ప్రాధాన్యే రాజలిఙ్గే చ వృషాఙ్గే కకుదో(ఽ స్త్రియామ్)॥ ౨౮౦

కకుదః॥ పు॥(న)కకుత్ ।ద్, సీ॥ ఇది, ప్రాధాన్యే= ప్రధానమయిన దానికిని, రాజలిఙ్గేచ = రాజచిహ్నమునకును, వృషాఙ్గే = ఎద్దు మూఁపురమునకును పేరు. Chief; royal insignia; hump of a bull.

(స్త్రీ)సంవి(జ్జ్ఞానసంభాషాక్రియాకారాజినామసు) Watchword; discourse

సంవిత్ ॥ ద్, సీ॥ ఇది, జ్ఞాన = జ్ఞానమునకును, సంభాషా = సంకేతమునకును (వ) సంభాషణమునకును, క్రియాకార=నిశ్చయమునకును, ఆజి=యుద్ధమునకును, నామసు=నామధేయమునకును పేరు. Knowledge; agreement; war; name.

(ధర్మే రహ)స్యుపనిష

ఉపనిషత్ ॥ద్,సీ॥ ఇది, ధర్మే=ధర్మమునకును, రహసి = రహస్యమునకును పేరు. Religious and moral merit; privacy; sacred lore.

(త్స్యాదృతౌ వత్సరే) శరత్ ॥ Sultry season.

శరత్ ॥ద్, సీ ఇది, ఋతౌ=శరదృతువునకును, వత్సరే=సంవత్సరమునకును పేరు. A year.

పదం(వ్యవసితిత్రాణస్థాన లక్ష్మాఙ్ఘ్రి వస్తుషు। Defence; place; mark; token; foot; thing.

పదమ్॥న॥ ఇది, వ్యవసితి=ఉద్యోగమునకును, త్రాణ=రక్షించుటకును, స్థాన = స్థానమునకును, లక్ష్మ=అడియాలమునకును, అఙ్ఘ్రి=అడుగునకును, వస్తుషు=వస్తువునకును పేరు. Industry; word.

గోష్పదం (సేవితే మానే) As much as a cow's footstep will hold.

గోష్పదమ్॥న॥ఇది, సేవితే=ఆవులుతిరుగుప్రదేశమునకును, మానే=ఆవులగొరిజదిగఁబడినగుంటకును పేరు. Spot frequented by kine.

(ప్రతిష్ఠాకృత్యయో) రాస్పదమ్॥ Business.

ఆస్పదమ్॥న। ఇది, ప్రతిష్ఠా=స్థానమునకును, కృత్యమ్=చేయఁదగిన దానికిని పేరు. Dignity; place.

(త్రిష్విష్టమధురౌ) స్వాదూ Sweet.

స్వాదుః॥ త్రి॥ ఇది, ఇష్ట=ఇష్టమయిన దానికిని, మధురౌ=మధురమయిన దానికిని పేరు. Desired.

మృదూ (చాతీక్ష్ణకోమలౌ)। Gentle

మృదుః॥ త్రి॥ ఇది, అతీక్ష్ణ=క్రూరముకానిదానికిని, కోమలౌ= మెత్తనిదానికిని పేరు. Soft; blunt.

(మూఢాల్పాపటు ని

మన్దః॥ త్రి॥ ఇది, మూఢ=మూఢునికిని, అల్ప=అ

ర్భాగ్యౌ) మన్దాస్వ్యౌ Little; unlucky. | ల్పమైనదానికిని, అపటు=సమర్థుఁడు కానివానికిని, నిర్భాగ్యః=నిర్భాగ్యునికిని పేరు. Foolish, dull.

(త్ర్యాతు) శారదా ॥ ప్రత్యగ్రాప్రతిభా | శారదః॥ త్రి॥ఇది, ప్రత్యగ్ర = నూతనమయిన దానికిని, అప్రతిభా=సమర్థుఁడు కానివానికిని పేరు. New; diffident.

(విద్వత్సుప్రగల్భౌ) విశారదౌ। Learned. | విశారదః॥ త్రి॥ ఇది, విద్వత్=విద్వాంసునికిని, సుప్రగల్భ=ప్రౌఢునికిని పేరు. Confident.

*ఇతి దాన్తాః.* | దాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

(వ్యామో వటశ్చ) న్యగ్రోధౌ a fathom. | న్యగ్రోధః॥పు॥ఇది, వ్యామః=బారకును, వటశ్చ=మఱ్ఱి చెట్టునకును పేరు. Banian tree.

ఉత్సేధః (కాయఉన్నతిః)॥ ౨౫౨॥ | ఉత్సేధః॥పు॥ఇది, కాయః=శరీరమునకును, ఉన్నతిః=పొడవునకును పేరు. Body; height.

(పర్యాహారశ్చ మార్గశ్చ) వివధో వీవధౌ చ తౌ। Storing of corn; a yoke for burdens. | వివధః-వీవధః॥పు॥ ఈ రెండును, పర్యాహారశ్చ=వర్తకుఁడు దేశాంతరమునుండి తెచ్చి విక్రయస్థానమందునిచిన వస్తువులకును (వ) కావడికిని, మార్గశ్చ=మార్గమునకును పేళ్లు. A high way.

పరిధి (ర్యజ్ఞియతరోః శాఖాయాం ముపసూర్యకే) ॥ Branch of a tree at a sacrifice. | పరిధిః॥పు॥ ఇది, యజ్ఞియతరోః=యజ్ఞార్హమైన మేడిచెట్టు మొదలైనదానియొక్క, శాఖాయామ్=కొమ్మకును, ఉపసూర్యకే=పరివేషమునకును పేరు. A misty halo round the sun.

(బన్ధకంవ్యసనం చేతఃపీడాఽధిష్ఠాన) మాధయః। Calamity; anxiety; residence. | ఆధిః॥ పు॥ ఇది, బన్ధకమ్=తాకట్టు మొదలగు కుదువ పెట్టుటకును, వ్యసనమ్=జూదము మొదలయినవ్యసనమునకును, చేతఃపీడా = మనోదుఃఖమునకును, అధిష్ఠానమ్=ఆశ్రయించుటకును పేరు. A pledge.

(స్యాన్సమర్థన నీవాకనియమాశ్చ) సమాధయః॥ Reconciling of differences ; silence; collecting grain in | సమాధిః॥పు॥ఇది,సమర్థనం=శంకాపరిహారమునకును, నీవాక = మూల్లాడకుండుటకును [వ] అగ్గువైనధాన్యములయందు జనుల యాదరమునకును, నియమః=వ్రతోపవాసాదులకును [వ]అంగీకారమునకును, చకారమువలన చిత్తైకాగ్రము

scarcity.

(దోషోత్పాదే) ను
బన్ధస్స్యాత్ (ప్ర)కృత్యా
దివినశ్వరే। ముఖ్యాను
యాయిని శిశౌ ప్రకృ
తస్యానువర్తనే)॥ An
indicatory letter not
sounded; a child fol-
lowing an example.
౨౫౫॥

విధు (ర్విష్ణౌ చన్ద్ర
మసి)

(పరిచ్ఛేదేబిలే) ఽవ
ధిః।

విధి (ర్విధానే దైవేఽ
పి) Performing; fate;
Brahma; command.

ప్రణిధిః (ప్రార్థనే చ
రే)॥ ౨౫౬॥

బుధవృద్ధౌ (పణ్డితేఽ
పి)

స్కన్ధ (స్సముదయేఽపి
చ)। Shoulder; the
trunk of a tree; a troop;
the five forms of mun-
dane consciousness.

(దేశే నదవిశేషేఽ
బ్ధౌ) సిన్ధుర్నా సరితి స్త్రి

:కును పేరు. Vow or promise; deep meditation.

అనుబన్ధః॥పు॥ ఇది, దోషోత్పాదే=దోషోత్పా
దమునకును, ప్రకృత్యాదివినశ్వరే=ప్రకృతిప్రత్య
యాదులయందు నశించిపోవునక్షరమునకును, ము
ఖ్యానుయాయిని=ముఖ్యులయిన తండ్రి మొదలై
నవారినిఅనుసరించిపోవు, శిశౌ=శిశువునకును, ప్ర
కృతస్య అనువర్తనే = ప్రకృతమయినదియొడతె
గకయనువర్తించుటకును పేరు. ముఖ్యులయినవా
రికిని, ననుసరించినవారికిని, శిశువునకును పేరని
కొందరు. Offence; continued devotion.

విధుః॥పు॥ఇది, విష్ణౌ=విష్ణువునకును, చన్ద్రమసి=
చంద్రునికిని పేరు. Vishnu; moon.

అవధిః॥ పు॥ ఇది, పరిచ్ఛేదే=మర్యాదకును, బి
లే=బిలమునకును పేరు. Limit; a hole.

విధిః॥పు॥ ఇది, విధానే = చేయుటకును, దైవే=
దైవమునకును, (అపి) బ్రహ్మదేవునికిని, ప్రకారము
నకును, విధాయక వాక్యమునకును పేరు. Form.

ప్రణిధి॥పు॥ఇది, ప్రార్థనే=ప్రార్థనకును, చరే=వే
గులవానికిని పేరు. Request; a spy; situation.

బుధః॥పు॥-వృద్ధః॥త్రి॥-ఈ ౨ను పణ్డితే=విద్వాం
సునికి పేళ్లు. Learned. (అపి) వరుసగా బుధునికిని,
(Planet mercury), ముసలివానికిని (old) పేళ్లు.

స్కన్ధః॥పు॥ ఇది, సముదయే=అధ్యాయాది స
మూహమునకును, (అపి) మూపునకును, చెట్టు
మొదటికిని, సైన్యమునకును, బౌద్ధశాస్త్రోక్తమైన
రూపవేదనా విజ్ఞానసంజ్ఞాసంస్కారము లను పంచ
స్కంధములకును పేరు. Multitude; chapter.

సిన్ధుః॥పు॥ దేశే=దేశవిశేషమునకును, నదవిశే
షే=నదవిశేషమునకును, అబ్ధౌ=సముద్రమునకును;

యాన్)॥ ౨౧౫౭॥ ॥సీ॥సరిత్=సామాన్యముగా నదికిని పేరు. Name of a country; name of a river.

The sea; a river

విధా(విధౌ ప్రకారే చ) విధా॥సీ॥ [ప] పు॥ ఇది, విధౌ=చేయుటకును, ప్రకారే=ప్రకారమునకును, (చ) గజాన్నమునకును, కూలికిని పేరు. Action; form or rule.

Manner; fodder.; hire.

సాధూ (రమ్యే౽పి చ త్రిషు) । Handsome సాధుః॥ త్రి॥ ఇది, రమ్యే=ఒప్పిదమైనదానికిని, (అపి) సజ్జనునికిని పేరు Right; virtuous.

వధూ (జాయా స్నుషా స్త్రీ చ) వధూః సీ॥ ఇది, జాయా = పెండ్లామునకును, స్నుషా = కోడలికిని, స్త్రీ = స్త్రీమాత్రమునకును, Wife; daughter-in-law; woman.

సుధా(లేపో౽మృతం స్నుహీ)॥ ౨౧౫౮॥ సుధా॥సీ॥ ఇది, లేప=సున్నముపూయుటకును, అమృతమ్ = అమృతమునకును, స్నుహీ=జెముడు చెట్టునకును పేరు. Euphorbia Tirucalli.

Plaster; nectar.

సన్ధా(ప్రతిజ్ఞా మర్యాదా) సన్ధా॥ సీ॥ ఇది, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞకును,మర్యాదా=మేరకును పేరు.Promise; limit.

శ్రద్ధా(సంప్రత్యయః స్పృహా) । Fondness. శ్రద్ధా॥ సీ॥ఇది,సంప్రత్యయః = భక్త్యతిశయమునకును, స్పృహా=ఇచ్ఛకును పేరు. Belief.

మధు (మద్యే పుష్పరసే క్షౌద్రే౽పి) మధు॥న॥ఇది,మద్యే=మద్యమునకును, పుష్పరసే=పూదేనెకును, క్షౌద్రే= తేనెకును, (అపి) చైత్రమాసమునకును, మధువను రాక్షసునికిని,॥పు॥ ఇప్ప చెట్టునకు. Ardent spirit; nectar of flowers.

A month; a demon; bassia latifolia; honey.

న్ధం(తమస్యపి)॥ ౨౧౫౯॥ అన్ధమ్॥ఇది, తమసి=చీకటికి పేరైనపుడు॥న॥, (అపి) గ్రుడ్డివానికి పేరైనపుడు॥ త్రి॥ Blind.

Darkness.

(అథ త్రిషు) ముందుచెప్పఁగల ధాంతశబ్దములు॥ త్రి॥

సమున్నద్ధౌ (పణ్డితం మన్యగర్వితౌ)।Conceited of learning. సమున్నద్ధః॥ త్రి॥ ఇది, పణ్డితంమన్య = పండితుఁడుగాక యే తాను పండితుఁ డనుకొను వానికిని, గర్వితౌ=గర్వముగలవానికిని పేరు. Proud.

బ్రహ్మబన్ధు (రధిక్షేపే నిర్దేశే౽) బ్రహ్మబన్ధుః॥ త్రి॥ ఇది, అధిక్షేపే=బ్రాహ్మణకర్మహీనుఁడైన బ్రాహ్మణునికిని, నిర్దేశే=ద్వేషము చేత

| | |
|---|---|
| A nominal Brahmana. | పేర్కొనంబడినవానికిని. An unworthy Brahmana. |
| (ధావలమ్బితః॥౨౬౦॥ అవిదూరో) ప్యవష్టబ్ధః Near; bound. | అవష్టబ్ధః॥త్రి॥ఇది, అవలమ్బితః=అవలంబింపఁబడినవానికిని, అవిదూరః = దగ్గఱనున్నదానికిని, (అపి) కట్టఁబడినదానికిని పేరు. Relied on. |
| ప్రసిద్ధౌ (ఖ్యాతభూషితౌ)। Celebrated. | ప్రసిద్ధః॥త్రి॥ఇది, ఖ్యాత = ఖ్యాతిగలవానికిని; భూషితౌ=అలంకరింపఁబడినదానికిని. Adorned. |
| ❀ ఇతిథాన్తాః. ❀ | థాన్త నానార్థక శబ్దములు ముగిసెను. |
| (సూర్యవహ్నీ) చిత్రభానూ। | చిత్రభానుః॥పు॥ఇది, సూర్య=సూర్యునికిని, వహ్నీ=అగ్నికిని పేరు. Fire; the sun. |
| భానూ(రశ్మిదివాకరౌ)॥౨౬౧॥ | భానుః॥పు॥ఇది, రశ్మి=కిరణమునకును, దివాకరౌ=సూర్యునికిని పేరు. Ray of light; the sun. |
| భూతాత్మానౌ(ధాతృదేహౌ) | భూతాత్మా॥న్, పు॥ ఇది, ధాతృ=బ్రహ్మకును, దేహౌ=దేహమునకును పేరు. Brahma; body. |
| (మూర్ఖనీచౌ) పృథగ్జనౌ। One of low tribe. | పృథగ్జనః॥పు॥ ఇది, మూర్ఖ = మూర్ఖునికిని, నీచౌ=హీనజాతివానికిని పేరు. An ignorant man. |
| గ్రావాణౌ (శైలపాషాణౌ) | గ్రావా॥న్, పు॥ ఇది, శైల=పర్వతమునకును, పాషాణౌ=రాతికిని పేరు. Mountain; stone. |
| పత్త్రిణౌ (శరపక్షిణౌ)॥ ॥౨౬౨॥ | పత్త్రీ॥న్॥ఇది, శర = బాణమునకును, పక్షిణౌ=పక్షికిని పేరు. An arrow; a bird. |
| (తరుశైలౌ) శిఖరిణౌ | శిఖరీ॥న్,పు॥ ఇది, తరు=వృక్షమునకును, శైలౌ=పర్వతమునకును పేరు. Tree; mountain. |
| శిఖినౌ(వహ్నిబర్హిణౌ) | శిఖీ॥న్, పు॥ఇది, వహ్ని = అగ్నికిని, బర్హిణౌ=నెమిలికిని పేరు. Fire; a peacock. |
| ప్రతియత్నౌ (ఉభౌ లిప్సోపగ్రహౌ) | ప్రతియత్నః॥ పు॥ ఇది, లిప్సా=అభిలాషకును, ఉపగ్రహౌ = చెఱపట్టుటకును, ప్రతికారమునకును పేరు. Desire; making prisoner; retaliation. |
| వథ సాదినౌ॥ (ద్వౌ సారథిహయారోహౌ) | సాదీ॥న్,పు॥ సారథి=సారథికిని,హయారోహౌ=గుఱ్ఱపురౌతునకును పేరు. Charioteer; horseman. |
| వాజినో౽ (శ్వేషుప | వాజీ॥న్,పు॥ఇది, అశ్వ=గుఱ్ఱమునకును,ఇషు= |

క్షిణః) । Arrow; bird. — బాణమునకును, పక్షిణః=పక్షికిని పేరు. Horse.

(కులే౽ప్యభిజనో(జన్మభూమ్యామపి)) Native country.

అభిజనః॥పు॥ఇది, కులే=కులమునకును, జన్మభూమ్యాం=జన్మభూమికిని, (అపి) కీర్తికిని, కులాగతమగుచున్న ధ్వజాదులకును పేరు. Family; noble birth or descent; fame; retinue.

ధ హాయనాః॥ ౨౭౮॥ (వర్షార్చిర్వ్రీహి భేదా స్సు చ) Red rice.

హాయనః॥పు॥ ఇది, వర్ష=సంవత్సరమునకును; అర్చిః=కిరణమునకును, వ్రీహిభేదాః = ధాన్యవిశేషమునకును పేరు. A year; a ray of light.

(శ్చన్ద్రాగ్న్యర్కా) విరోచనాః । Fire.

విరోచనః॥పు॥ఇది, చన్ద్ర=చంద్రునికిని, అగ్ని=అగ్నికిని, అర్కః=సూర్యునికిని పేరు. Moon; sun.

(క్లేశే౽పి వృజినో) Distress.

వృజినః॥వి॥ క్లేశే=వెంట్రుకలకును, (అపి)॥న॥పాపమునకును, ॥పు॥ క్లేశమునకును. Hair; sin.

విశ్వకర్మా(ర్క సురశిల్పినోః)॥ The sun.

విశ్వకర్మా॥ న్,పు॥ అర్క=సూర్యునికిని, సురశిల్పినోః = దేవశిల్పికిని. Architect of the gods.

ఆత్మా (యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మ చ)। Natural disposition.

ఆత్మా॥న్, పు॥ యత్నః=యత్నమునకును, ధృతిః=ధైర్యమునకును, బుద్ధిః=బుద్ధికిని, స్వభావః=స్వభావమునకును, బ్రహ్మ=పరమాత్మకును, వర్ష్మ=దేహమునకును, (చ) జీవునికిని. Care; firmness; intellect; body; the supreme Brahma; sentient soul.

(శక్ర ఘాతుక మత్తేభ వర్షుకాబ్దా)ఘనాఘనాః॥ ౨౭౯॥

ఘనాఘనః॥ శక్ర=దేవేంద్రునికిని, ఘాతుక=చంపుస్వభావముగల, మత్తేభ=మదపుటేనుఁగునకును, వర్షుకాబ్దాః = వర్షించు మేఘమునకును పేరు. Indra; a vicious elephant; a rainy cloud.

అభిమానో౽(ర్థాదిదర్పే౽జ్ఞానే ప్రణయ హింసయోః)। Request; killing.

అభిమానః॥పు॥ అర్థాది=ధనాదులచేత వచ్చిన, దర్పే=గర్వమునకును, అజ్ఞానే=అజ్ఞానమునకును, ప్రణయ=ప్రార్థనకును, హింసయోః = హింసకును Pride of wealth &c.; ignorance; affection.

ఘనో (మేఘే మూర్తిగుణే త్రిషు మూర్తే

ఘనః॥పు॥ఇది, మేఘే=మేఘమునకును, మూర్తిగుణే=కాఠిన్యమునకును పేరు, మూర్తే=కఠినమైన

నిరన్తరే)॥ ౨౭౭॥
A cloud ; solidity ; solid ; anvil ; cymbal.

వస్తువునకును, నిరన్తరే=దట్టమైన వస్తువునకును పేరైనపుం॥త్రి॥ ఇది లోహముద్గరము స్తాకాంస్యతాళాదులకును పేరు. Uniformly extended.

ఇన(స్సూర్యే ప్రభౌ)

ఇనః॥పు॥ఇది, సూర్యే=సూర్యునికిని, ప్రభౌ=ప్రభువునకును పేరు. The sun ; a king.

రాజా (మృగాఙ్కే-క్షత్రియేనృపే) । Moon ; a soldier by tribe.

రాజాన్, పు॥ ఇది, మృగాఙ్కే=చంద్రునికిని, క్షత్రియే=క్షత్రియజాతివానికిని, నృపే=భూమినేలువానికిని ప్రభువునకును పేరు. A king.

వాణిన్యౌ.(నర్తకీ దూత్యౌ) A woman intoxicated.

వాణినీ॥సీ॥ ఇది, నర్తకీ=నాట్యమాడు స్త్రీకిని, దూత్యౌ=దూతికా స్త్రీకిని పేరు. ఇచట "మత్తావిదగ్ధేవాణిన్యౌ" అనిపాఠముగలదు. A dancing girl.

(స్రవన్త్యా మపి) వాహినీ॥ ౨౭౮

వాహినీ॥ సీ॥ ఇది, స్రవన్త్యామ్=నదికిని, (అపి) సేనావిశేషమునకును పేరు. River; an army.

హ్లాదిన్యౌ (వజ్రతటితౌ) Lightning.

హ్లాదినీ॥సీ॥ఇది, వజ్ర=వజ్రాయుధమునకును, తటితౌ=మెఱుపునకును పేరు. The thunderbolt.

(వన్దాయామపి) కామినీ। A loving woman.

కామినీ॥సీ॥ ఇది, వన్దాయామ్=బదనికకును, (అపి) విలాసినియైన స్త్రీకిని పేరు. A climbing plant.

(త్వగ్దేహయోరపి) తను The skin; body; thin; small.

తనుః॥ సీ॥ ఇది, త్వక్ = తోలునకును, దేహయోః=దేహమునకును పేరు, (అపి)అల్పమైన దానికిని, సన్నమైన దానికిని పేరైనపుం॥త్రి॥

సూనా౽(ధోజిహ్వా కాఽపి చ)॥ The uvula.

సూనా॥సీ॥ఇది,అధోజిహ్వికాఽపిచ=కొండనాలుకకును,(అపి)వధస్థానమునకును.place of execution.

క్రతు విస్తారయో ర్ వితానం (త్రిషుతుచ్ఛకే।మన్దే)౽ Dull.

వితానమ్॥క్రతుః=యజ్ఞమునకును,విస్తారయోః=విస్తారమునకును,॥త్రి॥ తుచ్ఛకే=రిక్తమైనదానికిని, మన్దే=మందునికిని.A sacrifice; expansion; empty.

థ కేతనం (కృత్యే కేతా వుపనిమన్త్రణే) ॥ ౨౭౯॥ an invitation.

కేతనమ్॥న॥ఇది, కృత్యే= చేయదగిన దానికిని, కేతౌ=టెక్కెమునకును, ఉపనిమన్త్రణే = బ్రాహ్మణుల నిమంత్రణము చేయుటకును పేరు. An indispensable act; a standard or symbol.

(వేద స్తత్త్వం తపో) బ్రహ్మ బ్రహ్మా (విప్రః ప్రజాపతిః)। Devotion; Brahmin; the creator.

బ్రహ్మ॥న్॥ఇది, వేదః=వేదమునకును, తత్త్వమ్=పరమాత్మకును, తపః=తపస్సునకును పేరైనపుడు॥ న॥, విప్రః=బ్రాహ్మణునికిని, ప్రజాపతిః=బ్రహ్మదేవునికి పేరైనపుడు॥పు॥ Holy writ; The supreme being.

(ఉత్సాహనే చ హింసాయాం సూచనే చాపి) గన్ధనమ్॥ ౨౭౦॥ Manifestation.

గన్ధనమ్॥న॥ఇది, ఉత్సాహనే=ఉత్సాహమునకును, హింసాయామ్ = హింసించుటకును, సూచనే=ఎఱిఁగించుటకును పేరు. (అపి) ప్రకాశమునకును పేరు. Perseverance; destruction; hint.

ఆతఞ్చనం(ప్రతీవాప జవనాప్యాయనార్థకమ్)।Causing to curdle; calcining; speed; gratifying.

ఆతఞ్చనమ్॥న॥ఇది, ప్రతీవాప=ప్రతివాపమునకును, జవన=వేగమునకును, ఆప్యాయనార్థకమ్=తృప్తిచేయుటకును. ప్రతీవాపమనఁగరఁగిన బంగారు మొదలైన దానిని ద్రవ్యాంతరముతోఁ గూర్చి పొడిచేయుట, పాలుతోడుపెట్టుట యనికొందఱు.

వ్యఞ్జనం (లాఞ్ఛనే శ్మశ్రు నిష్ఠానావయవేష్వపి)॥ ౨౭౧॥ Private part of male or female.

వ్యఞ్జనమ్॥న॥ ఇది, లాఞ్ఛనే=గుఱుతునకును, శ్మశ్రునిష్ఠానావయవేషు=గడ్డము మీసాలకును, తిమ్మనమునకును, స్త్రీపురుషుల గుహ్యావయవములకును, (అపి) కకారాది వర్ణములకును పేరు. A mark; beard; condiment; a consonant.

(స్యా)త్కౌలీనం (లోకవాదే యుద్ధే పశ్వహిపక్షిణామ్)। Rumour;

కౌలీనమ్॥న॥ఇది, లోకవాదే=లోకాపవాదమునకును, పశ్వహిపక్షిణామ్=పశుసర్పపక్షులయొక్క, యుద్ధే=యుద్ధమునకును పేరు. Combat of animals.

స్యాదుద్యానం(నిస్సరణే వనభేదే ప్రయోజనే)॥a garden; purpose.

ఉద్యానమ్॥న॥ఇది, నిస్సరణే=గృహాదుల నుండి వెడలుటకును, వనభేదే=శృంగారపుతోటకును, ప్రయోజనే=ప్రయోజనమునకును. Going forth;

(అవకాశే స్థితౌ) స్థానం

స్థానమ్॥న॥ఇది, అవకాశే=తావునకును, స్థితౌ=ఉనికికిని పేరు. Place; stay; leisure.

(క్రీడాదావపి) దేవనమ్। Emulation; splendour; praise; business; mo-

దేవనమ్॥ న॥ ఇది, క్రీడాదౌ=క్రీడకును, ఆది శబ్దమువలన విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతులకును, (అపి) విలాపము

tion; grief; gambling.

ఉత్థానం (పౌరుషేతన్త్రే సన్నివిష్టోద్గమేఽపిచ)॥ ౨౨౪॥

Joy; evacuating (by stool &c.,)

వ్యుత్థానం(ప్రతిరోధేచవిరోధాచరణేఽపిచ

Turning away; independent action.

(మారణే మృతసంస్కారేగతౌద్రవ్యేఽర్థదాపనే॥ ౨౨౫॥ నిర్వర్తనోప కరణాను వ్రజ్యాసు చ సాధనమ్।

Killing; obsequies; motion; substance; wealth; means; following; the penis; an army;

నిర్యాతనం (వైరశుద్ధౌ దానే న్యాసార్పణేఽపిచ)॥ ౨౨౬॥

Delivery of a deposit;

వ్యసనం(విపది భ్రంశే దోషే కామజకోపజే)।

Vice; calamity; fall.

పక్ష్మ (అక్షిలోమ్ని కిఞ్జల్కే తన్త్వాద్యంశే ఽప్యణీయసి)॥ Filament

నకును, జూదమునకును పేరు. Sport or play.

ఉత్థానమ్॥న॥ ఇది, పౌరుషే=పురుషప్రయత్నమునకును, తన్త్రే=సైన్యమునకును, సన్నివిష్టోద్గమే=కూర్చున్నవాఁడు లేచుటకును, (అపి)మలోత్సర్గమునకును,హర్షమునకును పేరు. Manly exertion; an army; getting up.

వ్యుత్థానమ్॥ న॥ ప్రతిరోధేచ = అడ్డపెట్టుటకును,విరోధాచరణే=ప్రతికూలము చేయుటకును, (అపి) స్వాతంత్ర్యకృత్యమునకును, సమాధిమానుటకును పేరు. Abstract meditation; opposition.

సాధనమ్॥న॥ఇది, మారణే=చంపుటకును,మృతసంస్కారే=మృతునిసంస్కరించుటకును [వ]వసనాభి మొదలయిన దానివిషముపోఁగొట్టుటకును, గతౌ = గమనమునకును, ద్రవ్యే = వస్తువునకును, అర్థదాపనే=అప్పుపుచ్చుకొన్న యర్థము నిప్పించుటకును, నిర్వర్తన=సాధించుటకును, ఉపకరణ=ఉపాయమునకును, అనువ్రజ్యాసు=వెంటఁబోవుటకు,(చ)సైన్యమునకు, మేఢ్రమునకును. Enforcement of the payment of debt; accomplishing.

నిర్యాతనమ్॥ న॥ ఇది, వైరశుద్ధౌ=పగసాధించుటకును, దానే=దానమునకును, న్యాసార్పణే=దాఁచఁబెట్టినది తిరుగనిచ్చుటకును, (అపి)అప్పుతీర్చుటకును. Payment of a debt;revenge; gift.

వ్యసనమ్॥న॥ఇది, విపది=ఆపదకును, భ్రంశే=పడుటకును, కామజకోపజేదోషే=కామక్రోధములవలనఁబుట్టిన స్త్రీద్యూతాదిసప్తవ్యసనములకును పేరు.

పక్ష్మ॥న్,న॥ఇది, అక్షిలోమ్ని=ఱెప్పవెండ్రుకలకును, కిఞ్జల్కే=ఆకరుపువ్వులకును,తన్త్వాద్యంశే=సూక్ష్మమైననూలు మొదలైన దానితునుకలకును,

of a flower; a wing.
(అవి) పక్ష్ములలోను పునుసకు. a short thread; eyelash.

(తిథిభేదే క్షణే) పర్వ
Festival; a knot or joint; a chapter.
పర్వ॥న్,న॥ ఇది, తిథిభేదే=పున్నమ మొదలైన పర్వతిథులకును, క్షణే=ఉత్సవమునకును. ఇదిగాక పున్నమ సాహస్యమునందికని, కణుపునకును, ప్రస్తావమునకును. The full and change of the moon.

వర్త్మ (నేత్రచ్ఛదే ఽధ్వని)।
వర్త్మ॥న్, న॥ ఇది, నేత్రచ్ఛదే = ఱెప్పకును, అధ్వని= తెరువునకును పేరు. Eyelid; a road.

(అకార్యగుహ్యే) కౌపీనే
An unfit act.
కౌపీనమ్॥ న॥ ఇది, అకార్య=చేయరానిపనికిని, గుహ్యే=గుహ్యమునకును [వ] గోచికిని పేరు. Privy part; or covering of it.

మైథునం (సఙ్గతౌ రతౌ)॥ ౨౨౮॥
మైథునమ్॥ న॥ ఇది, సంగతౌ=సంబంధమునకును, రతౌ=సురతమునకును పేరు. Union; copulation.

ప్రధానం(పరమాత్మా ధీః)
Minister; chief.
ప్రధానమ్॥న॥ ఇది, పరమాత్మా = పరమాత్మకును, ధీః=బుద్ధికిని, ప్రకృతికిని, ప్రధానికిని, ముఖ్యునికిని పేరు. The supreme soul; nature; intellect.

ప్రజ్ఞానం(బుద్ధిచిహ్నయోః)।
ప్రజ్ఞానమ్॥న॥ ఇది, బుద్ధి = బుద్ధికిని, చిహ్నయోః=గుఱుతునకును పేరు. Knowledge; token.

ప్రసూనం (పుష్పఫలయోః) A fruit.
ప్రసూనమ్॥ న॥ ఇది, పుష్ప=పుష్పమునకును, ఫలయోః=ఫలమునకును పేరు. A blossom.

నిధనం (కులనాశయోః)॥ ౨౨౯॥
నిధనమ్॥ న॥ ఇది, కుల=కులమునకును, నాశయోః=నాశమునకును పేరు. A family; death.

క్రన్దనే (రోదనాహ్వానే)
క్రన్దనమ్॥ న॥ ఇది, రోదన = ఏడ్పునకును, ఆహ్వానే=పిలుచుటకును పేరు. Weeping; a calling.

వర్ష్మ (దేహప్రమాణయోః)।
వర్ష్మ॥న్,న॥ఇది, దేహ=దేహమునకును, ప్రమాణయోః=కొలతకును పేరు. Body; measure.

(గృహదేహత్విట్ప్రభావా) ధామాన్యథ
Dignity or majesty.
ధామ॥న్,న॥ ఇది, గృహ=గృహమునకును, దేహ=దేహమునకును, త్విట్=కాంతికిని, ప్రభావాః= ప్రభావమునకును పేరు. A house; body; light.

(థ)చతుష్పథే॥ ౨౩౦॥
సంస్థానమ్॥న॥ఇది, చతుష్పథే=నాలుగు తెరు

కొండెకానికిని పేరు. Wicked; tale-bearer.

హీనన్యూనా (వూనగర్హ్యౌ) Deficient.

హీనః-న్యూనః॥ త్రి॥ ఈ రెండును, ఊనః=తక్కువైనదానికిని, గర్హ్యః=నిందింపఁబడినదానికిని. Blamable.

(వేగిశూరౌ)తరస్వినౌ॥ ౨౮॥

తరస్వీ॥న్, త్రి॥ఇది, వేగి = వేగముగలవానికిని, శూరౌ=బలవంతునికిని పేరు. Swift; valiant.

అభిపన్నో (ఽపరాద్ధోఽరిగ్రస్త వ్యాపద్గతావపి)। Fugitive.

అభిపన్నః॥ త్రి॥ఇది, అపరాద్ధః=అపరాధముచేసినవానికిని, అరిగ్రస్తః = శత్రువుచేతఁ బట్టుపడినవానికిని, వ్యాపద్గతావపి=ఆపదఁబొందినవానికిని పేరు. Guilty; subdued; involved in calamity.

→ ఇతి నాన్తాః. ←

నాన్త నానార్థకశబ్దములు ముగిసెను.

కలాపో (భూషణేబర్హే తూణీరే సంహతావపి)॥ ౨౯॥

కలాపః॥ పు॥ ఇది, భూషణే = తొడవునకును, బర్హే = నెమలిపురికిని, తూణీరే = అమ్ములపొదికిని, సంహతావపి = సమూహమునకును పేరు. An ornament; peacock's tail; a quiver; multitude.

(పరిచ్ఛదే) పరీవాపః (పర్యుప్తౌ సలిలస్థితౌ)। Sowing around; standing water.

పరీవాపః॥పు॥ఇది, పరిచ్ఛదే=గుడారము మొదలయిన వానికిని, పర్యుప్తౌ= నెదపెట్టుటకును, సలిలస్థితౌ = నీళ్లు నిలుచుటకును [ప] నీళ్లయునికిపట్టునకును పేరు. పరిచ్ఛదమనఁగా పరివారమనికొందఱు. A piece of water; retinue; furniture.

(గోధుగ్గోష్ఠపతీ)గోపో The head of a cowpen; a herdsman; a king.

గోపః॥ పు॥ ఇది, గోధుక్=గొల్లవానికిని, గోష్ఠపతీ=ఆవులనేలువానికిని[ప]రాజునకును, అనేకగ్రామాధికారికిని. superintendent of a district.

(హరవిష్ణూ)వృషాకపీ॥ ౩౦॥

వృషాకపిః॥పు॥ఇది,హర=శివునికిని,విష్ణూ=విష్ణువునకును [ప] అగ్నికిని, ఇంద్రునికిని పేరు.

బాష్ప(ఊష్మాశ్రు)

బాష్పః॥పు॥ఇది, ఊష్మ=ఆవిరికిని, అశ్రు=కన్నీళ్లకును పేరు. Vapour; a tear.

కశిపు(స్త్వన్నమాచ్ఛాదనం ద్వయమ్)। Food; clothing.

కశిపుః॥ పు॥ ఇది, అన్నమ్=అన్నమునకును, ఆచ్ఛాదనమ్=వస్త్రమునకును, ద్వయం=ఈ రెంటికిని పేరు. Food and clothing.

తల్పం(శయ్యాట్టదా రేషు)

తల్పమ్॥న॥ [ప] ॥పు॥ఇది, శయ్యా=పాన్పున కును, అట్ట = అట్టళ్ళకును, దారేషు= పెండ్లాము నకును పేరు. A bed; an upper story; a wife.

(స్తమ్బేఽపి) విటపోఽ (స్త్రియామ్)॥ ౨౦౭

విటపః॥ పు॥ ఇది, స్తమ్బే=కసవుగంటకును, (అపి) చిగురునకును పేరు. A cluster; a sprout; a branch.

ప్రస్తరూప సురూపా భిరూపా (బుధమనోజ్ఞ యోః॥ భేద్యలిఙ్గాఅమీ॥

ప్రస్తరూపః-సురూపః-అభిరూపః త్రి॥ ఈ 3 ను,బుధ=విద్వాంసునికిని, మనోజ్ఞయోః= ఒప్పెడి వానికిని పేరు. Learned; pleasing.

(కూర్మ్యాం వీణాభేదేఽపి) కచ్ఛపీ॥ A lute.

కచ్ఛపీ॥ స్త్రీ॥ కూర్మ్యాం=ఆఁడుతాఁబేటికిని, వీణాభే దే=సరస్వతివీణకును పేరు. A female turtle.

ఇతి పాన్తాః.

పాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

[ (రవర్ణే పుంసి) రేఫ (స్స్యాత్ కుత్సితే వా చ్యలిఙ్గకః) ]

రేఫః॥ ఇది, రవర్ణే=రవర్ణమునకు పేరైనపుడు॥ పు॥, కుత్సితే=కుత్సితునికి పేరైనపుడు॥ త్రి॥. The letter R; vile.

ఇతి ఫాన్తాః.

ఫాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

(అన్తరాభవసత్త్వేఽశ్వే) గన్ధర్వో (దివ్యగాయనే)॥ A horse; a celestial musician.

గన్ధర్వః॥పు॥ఇది, అన్తరాభవసత్త్వే=అంతర పిశాచమునకును, అశ్వే=గుఱ్ఱమునకును, దివ్యగా యనే=దేవలోకమునందు పాడునట్టి విశ్వావసువు మొదలయినవారికిని పేరు. The soul after death and previous to its being born again.

కమ్బు(ర్నా వలయే శఙ్ఖే) A ring.

కమ్బుః॥పు॥ ఇది, వలయే=కడియమునకును,శఙ్ఖే శంఖమునకును పేరు. A conch or shell.

ద్విజిహ్వౌ (సర్పసూచకౌ)॥ A serpent.

ద్విజిహ్వః॥పు॥ఇది, సర్ప=సర్పమునకును,సూ చకౌ= కొండెగానికిని పేరు. An informer.

పూర్వో (ఽన్యలిఙ్గః ప్రాగాహ పుం బహుత్వే ఽపి పూర్వజాన్)॥ Eastern; prior; forefather.

పూర్వః॥ఇది, ప్రాక్ = పూర్వదిక్కునందు వస్తువునకును, పూర్వకాలమునందుండు వస్తువు నకును పేరు.అపుడువిశేష్యలింగము,పూర్వజాన్ ఆహ=పూర్వులయిన పితృపితామహాదులకు పేరై నపుడు, పుంబహుత్వేఽపి=పుంలింగబహువచన

ములయందున ర్తించును. గంధర్వద్విజహస్త్యశ్వపూర్వశబ్దములు 'నభయోరగభేద' మనుటచేత నీభాగ తనములయందుఁ జెప్పఁబడియెను.

ఇతి భాన్తాః.

భాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

కుమ్భౌ ఘటేభమూర్ధాంశౌ

కుమ్భః॥ పు॥ ఘట = కడవకును, ఇభమూర్ధాంశౌ=ఏనుఁగుకుంభస్థలమునకును పేరు. A jar; frontal globe of an elephant's head.

డిమ్భౌ తు శిశుబాలిశౌ॥ ౨౯౦॥

డిమ్భః॥పు॥ఇది, శిశు=శిశువునకును, బాలిశౌ=మూర్ఖునికిని పేరు. A child; an ignorant man.

స్తమ్భౌ స్థూణాజడీభావౌ Insensibility.

స్తమ్భః॥పు॥ఇది, స్థూణా=కంబమునకును, జడీభావౌ=స్రుక్కపడియుండుటకును పేరు. Pillar.

శమ్భూ బ్రహ్మత్రిలోచనౌ।

శమ్భుః॥పు॥ఇది, బ్రహ్మ=బ్రహ్మకును, త్రిలోచనౌ=శివునికిని పేరు. Brahma; Siva.

కుక్షిభ్రూణార్భకా గర్భాః

గర్భః॥పు॥ ఇది, కుక్షి=కడుపునకును, భ్రూణ=కడుపులోని శిశువునకును, అర్భక=బాలునికిని పేరు. The belly; A fœtus; a child.

విస్రమ్భః ప్రణయేఽపి చ॥ ౨౯౧ Amorous solicitation.

విస్రమ్భః॥పు॥ ప్రణయే చ=పరిచయమునకును, (అపి) క్రీడాకలహమునకును, విశ్వాసమునకును. Acquaintance; playful dispute; confidence.

(స్యాద్భేర్యాం) దున్దుభిః (పుంసి స్యాదక్షే) దున్దుభిః (స్త్రియామ్)।

దున్దుభిః॥ ఇది, భేర్యామ్= భేరికి పేరయినపుడు ॥పు॥, అక్షే=పాచికలయందుండు ఇత్తిగకు పేరైనపుడు॥స్త్రీ॥, అక్షమనఁగా పాచికలని కొందరు. A large drum; a die; a stake at play.

(స్యాన్మహారజనే క్లీబం) కుసుమ్భం (కరకే పుమాన్)॥ ౨౯౨॥

కుసుమ్భమ్॥ ఇది, మహారజనే=కుసుంబపుష్పమునకు పేరయినపుడు ॥న॥, కరకే=కమండలమునకు పేరయినపుడు॥పు॥ Safflower; a water-pot.

(క్షత్త్రియేఽపి చ) నాభి (ర్నా) Nave of a wheel; musk.

నాభిః॥పు॥క్షత్త్రియే చ=క్షత్త్రియునికిని,(అపి) విజిగీషుఁడయిన రాజునకును, ॥ప్ర॥ బొడ్డునకును. ॥స్త్రీ॥బండికంటిని నడిమికిని, ప్రధానమునకును, కస్తూ

రికని పేరు. An emperor; navel; chief point;

సురభి (ర్గవి చ స్త్రియామ్)॥ fragrant; pleasing.

సురభిః॥స్త్రీ॥, గవి=ఆవునకును, (చ), ॥పు॥ వసంత ఋతువునకును, ॥త్రి॥ మంచిపరిమళముగల దానికిని మనోహరమైన దానికిని పేరు. A cow; spring.

సభా (సంసది సభ్యే చ) one of a company; a gambling-house.

సభా॥స్త్రీ॥ సంసది=ఆస్థానమునకును, సభ్యే= సామాజికునికిని, (చ) సమూహమునకును, ద్యూతమందిరమునకును పేరు. A hall; an assembly.

(త్రిష్వధ్యక్షే౽పి) వల్లభః॥ Beloved.

వల్లభః॥త్రి॥ ఇది, అధ్యక్షే=అధ్యక్షునికిని, (అపి) ప్రియమయిన దానికిని పేరు. A superintendent.

॥ఇతి భాన్తాః॥

భాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

(కిరణప్రగ్రహౌ) రశ్మి A rein.

రశ్మిః॥పు॥ఇది, కిరణ= కిరణమునకును, ప్రగ్రహౌ=పగ్గమునకును పేరు. A ray of light.

(కపిభేకౌ) ప్లవఙ్గమౌ।

ప్లవఙ్గమః॥పు॥ ఇది, కపి=కోఁతికిని, భేకౌ = కప్పకును పేరు. An ape; a frog.

(ఇచ్ఛా మనోభవౌ) కామౌ

కామః॥పు॥ఇది, ఇచ్ఛా = ఇచ్ఛకును, మనోభవౌ=మన్మథునికిని పేరు. మిక్కిలి యనునర్థమున॥న॥ Desire; Cupid; much.

(శౌర్యోద్యోగౌ) పరాక్రమౌ॥ ౨౯౪॥

పరాక్రమః॥పు॥ఇది, శౌర్య= సామర్థ్యమునకును, ఉద్యోగౌ=చేయవలయుపనులం బ్రారంభించుటకును పేరు. Power; valour; exertion.

ధర్మాః (పుణ్య యమ న్యాయ స్వభావాచార సోమపాః)। Nature; usage; a sacrifice.

ధర్మః॥పు॥ఇది, పుణ్య=పుణ్యమునకును, యమ=యమునికిని, న్యాయ = నీతికిని, స్వభావ = స్వభావమునకును, ఆచార=ఆచారమునకును, సోమపాః = సోమయాజికిని [వ] యజ్ఞమునకును పేరు. Moral and religious merit; Yama; propriety.

(ఉపాయపూర్వ ఆరమ్భ ఉపధాచా) ప్యుపక్రమః॥ ౨౯౫॥ Commencement;

ఉపక్రమః॥పు॥ఇది, ఉపాయపూర్వ ఆరమ్భః= ఉపాయము నెఱిఁగి యారంభించుటకును, ఉపధా చ=అమాత్యాదులను పరీక్షించుటకును, (అపి) ఇది మొదలని చెప్పుటకును పేరు. Deliberate

test of honesty. | undertaking with knowledge of means.

(వణిక్పథః పురం వేదో) నిగమో

నిగమః ॥పు॥ ఇది, వణిక్పథః = అంగడివీధికని, పురమ్ = పట్టణమునకును, వేదః = వేదమునకును పేరు. A market; a town; Holy writ.

(నాగరో వణిక్)॥ నైగమౌ ద్వౌ A trader.

నైగమః॥పు॥ఇది, నాగరః = పట్టణమునందుండువానికని, వణిక్=వర్తకునికని పేరు. A citizen.

(బలే) రామో (నీల చారుసితే త్రిషు)॥ -అ-ఇ-॥ white.

రామః॥పు॥బలే = బలభద్రునికని, ॥త్రి॥ నీల= నల్లనివానికని, చారు = ఒప్పెడివానికని, సితే= తెల్లనివానికని పేరు. Balarama; black; pleasing.

(శబ్దాది పూర్వో బృన్దే ఽపి) గ్రామః

గ్రామః॥పు॥ఇది,శబ్ద=శబ్దము,ఆది= మొదలయినశబ్దములు, పూర్వః = పూర్వమందుండునట్టి, బృన్దే=సమూహమునకు పేరు. 'శబ్దగ్రామః-గుణగ్రామః' అని. (అపి) ఊరికని, స్వరసమూహమునకును పేరు. A multitude; a village. A octave in music.

(క్రాన్తౌ చ) విక్రమః। A stride; valour.

విక్రమః॥పు॥ఇది, క్రాన్తౌ=అక్రమించుటకును, (చ) పరాక్రమమునకును పేరు. overcoming;

[స్తోమః (స్తోత్రే ఽధ్వరే బృన్దే)

స్తోమః॥పు॥ఇది, స్తోత్రే=స్తోత్రమునకును, అధ్వరే=యాగమునకును, బృన్దే = సమూహమునకును పేరు. Praise; a sacrifice; an assembly.

జిహ్మః (కుటిలే ఽలసే)

జిహ్మః॥పు॥కుటిలే=వంకరయైనవానికిని,అలసే= మందమయినవానికిని పేరు. Crooked; slow, lazy.

గుల్మా (రుక్ స్తమ్బ సేనాశ్చ). Body of troops consisting of 9 platoons.

గుల్మః॥పు॥ఇది, రుక్ = గుల్మరోగమునకును, స్తమ్బః=పొదకును, సేనాః= సేనావిశేషమునకును పేరు. A disease of the spleen; a bush.

జామిః (స్వసృకులస్త్రియోః)॥ -అ-ఇ॥ A chaste woman;

జామిః[పా]యామిః॥స్త్రీ॥ఇది, స్వసృ=తోడఁబుట్టినవానికిని, కులస్త్రియోః=కులస్త్రీకని పేరు. జామి॥అవ్య॥-ఆలస్యము పేరందురు. A sister.

(క్షితిక్షాన్త్యోః) క్షమా (యుక్తే) క్షమం (శ

క్షమా॥స్త్రీ॥ క్షితి=భూమికని, క్షాన్త్యోః = ఓర్పునకును, ॥న॥యుక్తే = ఉచితమయిన వానికిని,

క్తే హితే (త్రిషు)।

॥త్రి॥ శక్తే=సమర్థునికిని, హితే=హితునికని పేరు. The earth; patience; fitness; able; benevolent.

(త్రిషు) శ్యామా (హరిత్కృష్ణౌ) శ్యామా (స్యాచ్ఛారిబా నిశా)॥ ౨౯౮॥

శ్యామః॥త్రి॥హరిత్=పచ్చనిదానికిని,కృష్ణౌ=నల్లనిదానికని, శ్యామా॥స్త్రీ॥శారిబా=సుగంధపాలకును, నిశా=రాత్రికిని పేరు. green; black; night; convolvulus argenteus.

లలామం (పుచ్ఛపుణ్డ్రాశ్వభూషా ప్రాధాన్యకేతుషు)।

a horse; a mark on the forehead of a horse.

లలామమ్[న]లలామ॥న్, న॥ఇది,పుచ్ఛ=తోఁకకును,పుణ్డ్ర=తిలకమునకును,అశ్వభూషా = గుఱ్ఱముయొక్క యాభరణమునకును [న] అశ్వ=గుఱ్ఱమునకును, భూషా=ఆభరణమునకును,ప్రాధాన్య=ప్రధానముయొక్క దానికిని, కేతుషు= టెక్కెమునకును పేరు. A tail; an ornament; chief; flag.

సూక్ష్మమధ్యాత్మమప్యా

The supreme soul.

సూక్ష్మమ్॥త్రి॥ అధ్యాత్మమ్ = పరమాత్మకును, (అపి) స్వల్పమైనదానికిని పేరు. An atom.

(ఆద్యే ప్రధానే) ప్రథమం (త్రిషు) ౨౯౯॥

ప్రథమమ్॥త్రి॥ ఇది, ఆద్యే=మొదటిదానికిని, ప్రధానే=ముఖ్యమయినదానికిని పేరు. First; Chief.

వామౌ (వల్గుప్రతీపౌ ద్వౌ) Pleasing; reverse.

వామః॥త్రి॥ఇది, వల్గు=మనోహరమయినదానికిని,ప్రతీపౌ=ప్రతికూలమయినదానికిని పేరు.

అధమౌ(న్యూనకుత్సితౌ)। Vile.

అధమః॥త్రి॥ఇది, న్యూన=కొదువైన దానికని, కుత్సితౌ=నిందింపఁబడినదానికిని పేరు. Low.

(జీర్ణం చ పరిభుక్తం చ) యాతయామ (మిదం ద్వయమ్)॥ ౩౦౦॥

యాతయామమ్॥త్రి॥ ఇది,జీర్ణం చ= చివికినదానికని, పరిభుక్తం చ=అనుభవింపఁబడిన దానికిని పేరు. Old; used.

ఇతి మాన్తాః.

మాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

(తురఙ్గగరుడౌ) తార్క్ష్యౌ

తార్క్ష్యః॥పు॥ఇది, తురంగ = గుఱ్ఱమునకును, గరుడౌ=గరుడునికిని పేరు. A horse; Garuda.

(నిలయాపచయౌ) క్షయౌ।

క్షయః॥పు॥ఇది,నిలయ=ఇంటికిని,అపచయౌ=నాశమునకును పేరు. A house; destruction.

శ్వశుర్యౌ (దేవరశ్యా

శ్వశుర్యః॥పు॥ఇది, దేవర=మగనితోఁడఁబుట్టిన

| | |
|---|---|
| తౌ) | వానికని, శ్యాలో=ఆలితోఁడఁబుట్టినవానికనిపేరు. Husband's brother; wife's brother. |
| భ్రాతృవ్యౌ (భ్రాతృ | భ్రాతృవ్యః॥పు॥ ఇది, భ్రాతృజ=తోఁడఁబుట్టినవానికొడుకునకును, ద్విషి = పగవానికనిపేరు. Brother's son; an enemy. |
| జద్విషో॥ పర్జన్యౌ(రసద భ్దేన్ద్రౌ) A thunder-cloud | పర్జన్యః॥పు॥ఇది, రసత్=ఉఱుము మెన్న, అబ్దః=మేఘమునకును, ఇన్ద్రౌ=ఇంద్రునకనిపేరు. Indra. |
| స్యా(దర్యః) స్వామివై శ్యయోః) । | అర్యః॥పు॥ఇది, స్వామి=ప్రభువునకును, వైశ్యయోః= వైశ్యునకని పేరు. Master; Vysia. |
| తిష్యః (పుష్యే కలి యుగే) | తిష్యః॥పు॥ఇది, పుష్యే=పుష్యనక్షత్రమునకును, కలియుగే=కలియుగమునకును పేరు. |
| పర్యాయో (ఽవసరే క్రమే) ॥ succession. | పర్యాయః॥పు॥ఇది, అవసరే - అవసరమునకును, క్రమే=వరుసనకును పేరు. Opportunity. |
| ప్రత్యయో (ఽధీనశపథ జ్ఞానవిశ్వాస హేతుషు । రన్ధ్రే శబ్దే) oath; knowledge; trust; cause; a hole; an affix. | ప్రత్యయః॥పు॥ ఇది, అధీన= అధీనమునకును, శపథ=శపథమునకును, జ్ఞాన= తెలివికని, విశ్వాస= విశ్వాసమునకును, హేతుషు = హేతువునకును, రన్ధ్రే=అవకాశమునకును, శబ్దే = కృత్తద్ధితములు మొదలగు ప్రత్యయములకును పేరు. subjected. |
| ఽనుశయో (దీర్ఘద్వేషానుతాపయోః) ౨౦౩॥ | అనుశయః॥పు॥ఇది, దీర్ఘద్వేష=దీర్ఘద్వేషమునకును, అనుతాపయోః=పశ్చాత్తాపమునకును పేరు An old enmity; repentence. |
| స్థూలోచ్చయ (స్త్వసాకల్యే గజానాం మధ్యమే గతే) । | స్థూలోచ్చయః॥పు॥ఇది, అసాకల్యే=సంపూర్ణముగాకుండుటకును, గజానామ్=ఏనుగులయొక్క, మధ్యమే=నడిమరమయిన, గతే = (తీవ్రమును మందమును కాని) గమనములకును పేరు. An elephant's middle pace; Incompleteness. |
| సమయో (శ్శపథాఽఽచార కాల సిద్ధాన్త సంవిదః)॥ ౨౦౪॥ | సమయః॥పు॥ఇది, శపథ=శపథమునకును, ఆచార=ఆచారమునకును, కాల=కాలమునకును, సిద్ధాన్త=సిద్ధాంతమునకును, సంవిదః=జ్ఞానమును, |

Agreement; hint.

సంకేతము మొదలయినదానికిని పేరు. An oath; usage; time; demonstrated conclusion.

(వ్యసనాన్యశుభం దైవం విపది) త్వనయోఽస్త్రియాః ।

అనయః॥పు॥ ఇది, వ్యసనాని=జూదము మొదలైనవ వ్యసనములకును, అశుభం దైవమ్=పూర్వజన్మమునం జేసిన యశుభకర్మమునకును. విపత్ = ఆపదకును పేరు. Vice; ill fortune; calamity.

అత్యయో (ఽతిక్రమే కృచ్ఛ్రే దోషే దణ్డేఽప్యథ) punishment; destruction.

అత్యయః॥పు॥ఇది, అతిక్రమే=అతిక్రమించుటకును, కృచ్ఛ్రే=దుఃఖమునకును, దోషే=దోషమునకును, దణ్డే=దండమునకును, (అపి) నాశమునకును పేరు. Transgression; distress; fault.

(థాఽఽపది॥3071॥యుద్ధాయత్యోః) స్సంపరాయః

సంపరాయః॥పు॥ ఇది, ఆపది=ఆపదకును, యుద్ధ=యుద్ధమునకును, ఆయత్యోః=భవిష్యత్కాలమునకును పేరు. Calamity; war; futurity.

పూజ్యస్తు (శ్వశురేఽపిచ)। respectable.

పూజ్యః ॥పు॥ ఇది, శ్వశురే చ=మామకును, (అపి) పూజార్హునికిని పేరు. Father-in-law.

(పశ్చాదవస్థాయిబలం సమవాయశ్చ) సన్నయః॥ multitude.

సన్నయః ॥పు॥ ఇది, పశ్చాత్ అవస్థాయి బలమ్=సేనకు వెనుకనుండుదండుదారిపోవుజనకును, సమవాయః = సమూహమునకును, Rear guard;

(సంఘాతే సన్నివేశేచ) సంస్త్యాయః

A house.

సంస్త్యాయః ॥పు॥ఇది, సంఘాతే = సమూహమునకును, సన్నివేశే=ఊరిచుట్టునుండు బయలునకును,(చ)గృహమునకును. Assemblage; vicinity.

ప్రణయా (స్త్వమీ విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణః) affection.

ప్రణయః ॥పు॥ ఇది, విస్రమ్భ=పరిచయమునకును, యాచ్ఞా=అడుగుటకును, ప్రేమాణః = ప్రేమకును పేరు. Acquaintance; solicitation.

(విరోధేఽపి) సముచ్ఛ్రయః॥ Elevation.

సముచ్ఛ్రయః॥పు॥ ఇది, విరోధే = వైరమునకును, (అపి) పొడవునకును పేరు. Enmity.

విషయో (యస్యయో జ్ఞాతస్తత్ర శబ్దాదికేష్వపి) । subject-matter;

విషయః॥పు॥ ఇది, యస్య = ఎవనికి, యః= ఏది, జ్ఞాతః = పరిచయము చేయఁబడునో, తత్ర= దానికిని. శబ్దాదికేషు = శబ్దస్పర్శరూపరసగంధ

object of sense.

ములకును, (అపి) దేశమునకును పేరు. Country.

(నిర్యాసేఽపి) కషాయో(ఽస్త్రీ)

Infusion; perfume.

కషాయః ॥పు॥ ఇది, నిర్యాసే=కషాయమునకును, (అపి) ఒగరునకును, మైపూతకును పేరు. Astringent taste; smearing.

(సభాయాంచ) ప్రతిశ్రయః॥ ३०८॥

ప్రతిశ్రయః॥పు॥ ఇది, సభాయాం= సభకును, (చ) ఉనికిపట్టునకును, గృహమునకును పేరు. Assembly; refuge; house.

ప్రాయో (భూమ్న్యన్తగమనే)

Starving oneself to death; similar.

ప్రాయః॥పు॥ ఇది, భూమ్ని = బాహుళ్యమునకును, అన్తగమనే=మరణార్థమై యాహారము లేకయుండుటకును పేరు. ఇదిగాక సమానమునందుత్తరపదమయి సదృశార్థమగును. Frequency.

మన్యు (ర్దైన్యే క్రతౌ క్రుధి)!

మన్యుః॥పు॥ఇది, దైన్యే=దైన్యమునకును, క్రతౌ=యజ్ఞమునకును, క్రుధి=కోపమునకును పేరు. Distress; sacrifice; anger.

(రహస్యోపస్థయో) ర్గుహ్యం

Tortoise.

గుహ్యమ్॥త్రి॥రహస్యే=దాఁచఁదగిన దానికిని, ॥న॥ ఉపస్థయోః = స్త్రీపురుషగుహ్యావయవములకును,॥పు॥ తాఁబేటికిని పేరు. A secret; privy part.

సత్యం (శపథతథ్యయోః)॥ ३०९॥

సత్యమ్॥న॥ శపథ = ఆనకును, ॥త్రి॥ తథ్యయోః=నిజమునకును. యుగభేదలోకభేదములకును పేరనికొందఱు. An oath; truth.

వీర్యం (బలే ప్రభావే చ)

Semen virile.

వీర్యమ్॥న॥ఇది, బలే=సత్త్వమునకును, ప్రభావే=ద్రవ్యశక్తికిని, (చ) రేతస్సునకును, తేజస్సునకును పేరు. Animal strength; dignity; splendour.

ద్రవ్యం(భవ్యే గుణాశ్రయే) । The substratum of qualities; wealth.

ద్రవ్యమ్॥న॥ఇది, భవ్యే = మంచిపదార్థమునకును, గుణాశ్రయే = గుణాశ్రయమైన వస్తువునకును పేరు. భవ్యుఁడనఁగా భాగ్యసంపన్నుఁడనియు యోగ్యుఁడనియు కొందఱు. Right; substance.

ధిష్ణ్యం (స్థానే గృహే భేఽగ్నౌ) Fire.

ధిష్ణ్యమ్॥న॥, స్థానే=తావునకును, గృహే = ఇంటికిని, భే=నక్షత్రమునకును, ॥పు॥అగ్నౌ=అగ్ని

కిని పేరు. A place; a house; an asterism.

భాగ్యం (కర్మ శుభాశుభమ్) ॥ ill fate.

భాగ్యమ్॥న॥ శుభాశుభమ్=శుభమును అశుభమును నైన, కర్మ=కర్మమునకు పేరు. Destiny; good luck;

(కశేరు హేమ్నో)ర్గాఙ్గేయం

గాఙ్గేయమ్ ॥న॥ ఇది, కశేరు = తామరకలువ మొదలయిన దాని కుంపకును, హేమ్నః=బంగారమునకును పేరు. A pignut; gold.

విశల్యా (దన్తికాఽపిచ)।

విశల్యా॥సీ॥ఇది, దన్తికా చ=దంతి చెట్టునకును, (అపి) పాపర చెట్టునకును, తతీగొట్టు చెట్టునకును, నాఁగేటిచాలికూరకును పేరు.

వృషాకపాయీ (శ్రీగౌర్యోః)

వృషాకపాయీ॥ సీ॥ఇది, శ్రీ=లక్ష్మికిని,గౌర్యోః=పార్వతికిని పేరు.

రభిఖ్యా (నామ శోభయోః)॥ ३०॥

అభిఖ్యా॥సీ॥ ఇది, నామ = నామధేయమునకును, శోభయోః= కాంతికిని పేరు. Name; beauty.

(ఆరమ్భోనిష్కృతిశ్శిక్షా పూజనం సంప్రధారణమ్। ఉపాయః కర్మ చేష్టా చ చికిత్సా చనవ) క్రియాః॥ ३१॥ Instruction; worship; expedient; act; bodily action; remedy; a verb; judicial investigation.

క్రియా॥సీ॥ఇది, ఆరమ్భః=ఉద్యోగమునకును, నిష్కృతిః=ప్రాయశ్చిత్తమునకును, శిక్షా = శిక్షకును, పూజనమ్ = పూజనమునకును, సంప్రధారణమ్=వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించుటలిఖితసాక్ష్యాదులకును, ఉపాయః=ఉపాయమునకును,కర్మ=వ్యాపారమునకును, చేష్టా=బుద్ధిపూర్వక వ్యాపారమునకును, చికిత్సా = చికిత్సకును, నవ=ఈతొమ్మిదింటికిని, (చ) ధాత్వర్థము మొదలయిన దానికిని పేరు. Beginning; atonement.

ఛాయా (సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బమనాతపః)।

ఛాయా ॥సీ॥ ఇది, సూర్యప్రియా = సూర్యుని భార్యకును, కాన్తిః = కాంతికిని, ప్రతిబిమ్బమ్ = ప్రతిబింబమునకును, అనాతపః = నీడకును పేరు. Wife of the sun; beauty; reflected image; shade.

కక్ష్యా (ప్రకోష్ఠే హర్మ్యాదేః కాఞ్చ్యాం మ

కక్ష్యా ॥సీ॥ ఇది, హర్మ్యాదేః = మేడలు మొదలయిన రాజగృహములయొక్క, ప్రకోష్ఠే=అంత

ధ్యేభబన్ధనే) ॥ ३०३॥
Enclosure of an edifice

రు వ్రులకును, కాఞ్చ్యామ్= మొలనూలికిని, మధ్యేభ బన్ధనే= ఏనుఁగునడుమునఁగట్టు మోకునకును. A string of bells; a rope round an elephant's body.

కృత్యా (క్రియా దేవ తయో స్త్రిషు భేద్యే ధ నాదిభిః) ।
Seduced from an alliance.

కృత్యా॥ సీ॥ క్రియా = చేయుటకును, దేవతయోః = దేవతావిశేషమునకును, ॥త్రి॥ ధనాదిభిః= ధనాదులచేత, భేద్యే = లోఁబఱచుకొనందగిన పరరాష్ట్రరాజులు మొదలయినవారికిని పేరు. A act; a certain deity.

జన్యం (స్యాజ్జనవాదే ఽపి)
bride's attendant; father; war.

జన్యమ్॥ త్రి॥ జనవాదే= లోకాపవాదమునకును, (అపి) యుద్ధమునకు, ॥పు॥ పెండ్లికొడుకు చెలికాండ్రకును, పెండ్లికొమారితభృత్యాదులకును, తండ్రికిని పేరు. A rumour; Bridegroom's companion.

జఘు (న్యోఽన్త్యేఽధమేఽపిచ)॥ ३०४॥

జఘన్యః॥ త్రి॥ అన్త్యే= వెనుకఁ బుట్టినవానికిని, అధమేచ= అధమునికిని, (అపి) శిశ్నమునకును పేరు. Last; worst; lowest; the penis.

(గర్హ్యాధీనౌ చ) వక్తవ్యౌ Dependent; fit to be said.

వక్తవ్యః ॥ త్రి ॥ ఇది, గర్హ్యే = కుత్సితునికిని, అధీనే= చెప్పినట్టు చేయువానికిని, (చ) పలుకందగిన శబ్దములకును పేరు. Reprehensible.

కల్యౌ (సజ్జ నిరామయౌ) । Healthy.

కల్యః ॥ త్రి ॥ ఇది, సజ్జ= సంపాదింపంబడినదానికిని, నిరామయౌ= రోగము లేనిదానికిని పేరు. Ready

(ఆత్మవాననపేతోఽర్థా) దర్థ్యౌ

అర్థ్యః॥ త్రి॥ ఇది, ఆత్మవాన్= ఎఱుకగలవానికిని, అర్థాత్ = అర్థమువలన, అనపేతః= ఎడఁబాయనివానికిని పేరు. Intelligent; wealthy.

పుణ్యం (తు చార్వపి)॥ ३०५॥

పుణ్యమ్॥ న॥ ఇది, చారు= ఒప్పిడిదానికిని, (అపి) సుకృతమునకును పేరు. Pleasing; a good action.

రూప్యం (ప్రశస్తరూపేఽపి)

రూప్యమ్॥ త్రి॥ ప్రశస్తరూపే= సౌందర్యముగలదానికిని, ॥న॥ ముద్ర వేసినబంగారునకును, వెండికిని పేరు. Beautiful; gold or silver coin.

వదాన్యో (వల్గువాగ

వదాన్యః॥ త్రి॥ ఇది, వల్గువాక్= లెస్సగామా

పి) ।Eloquent;generous. | టలాడువానికిని, (అపి) దాతకును పేరు.

( న్యాయ్యేౕపి ) మ ధ్య Middle. | మధ్యః॥త్రి॥, న్యాయ్యే = ఉచితమయినదానికిని,(అపి)॥ప్న॥నడుమునకు పేరు. just; reasonable.

సౌమ్యం తు (సున్దరే సోమదైవతే)॥ ౩౧౬॥ Handsome. | సౌమ్యమ్ ॥త్రి॥ ఇది, సున్దరే = ఒప్పెడుదానికిని, సోమదైవతే=సోముఁడు దేవతగాఁగలహవిస్సూక్తములకును పేరు. Sacred to the moon.

ఇతియాన్తాః. | యాన్తనానార్థక శబ్దములు ముగిసెను.

(నివహావసరౌ) వారౌ Occasion. | వారః॥పు॥ఇది, నివహే= సమూహమునకును, అవసరౌ=అవసరమునకును పేరు. Multitude.

సంస్తరౌ (ప్రస్తరాధ్వరౌ) । | సంస్తరః॥పు॥ఇది,ప్రస్తర= దర్భాదులచేతఁజేయఁబడిన పాన్పునకును,అధ్వరౌ=యజ్ఞమునకును పేరు. A bed of grass or bark; a sacrifice.

గురూ )గీష్పతి పిత్రాద్యౌ ) A spiritual teacher; heavy; great. | గురుః॥పు॥, గీష్పతి=బృహస్పతికిని, పిత్రాద్యౌ=తండ్రి మొదలైనపూజ్యులకును, భారవస్తువునకును. Jupiter ; a parent or other venerable relative.

ద్వాపరౌ (యుగసంశయౌ)॥ The third age. | ద్వాపరః॥ పు॥, యుగ = మూఁడవ యుగమునకును,సంశయౌ=సంశయమునకును పేరు. Doubt.

ప్రకారౌ (భేద సాదృశ్యే) | ప్రకారః॥పు॥ఇది, భేద=భేదమునకును, సాదృశ్యే=పోలికకును పేరు. Difference; similitude.

ఆకారౌ(ఇఙ్గితాౕకృతీ) । Hint; expression of the face; form. | ఆకారః ॥పు॥ ఇది,ఇఙ్గిత = అభిప్రాయసూచకమయినచేష్టకును, ఆకృతీ = అభిప్రాయసూచకమయిన ముఖరాగాది వికారమునకును పేరు.

కింశారూ (ధాన్యశూకేషూ) An arrow. | కింశారుః ॥పు॥ ఇది, ధాన్యశూక= వరిముంటికిని, ఇషూ=బాణమునకును పేరు. Beard of corn.

మరూ (ధన్వ ధరాధరౌ) ॥ A mountain. | మరుః॥పు॥ ఇది. ధన్వ=నిర్జలభూమికిని,ధరాధరౌ=పర్వతమునకును పేరు. A country void of water.

అద్రయో (ద్రుమశైలార్కాః) | అద్రిః॥పు॥ఇది, ద్రుమ= వృక్షమునకును, శైల=పర్వతమునకును, అర్కాః=సూర్యునికిని పేరు. A tree ; a mountain; the sun.

(స్త్రీ స్తనాబ్దౌ) పయోధరౌ। A cloud.

పయోధరః ॥పు॥, స్త్రీ_స్తన = స్త్రీ_స్తనమునకును, అబ్దా=మేఘమునకును పేరు. A woman's breast.

(ధ్వాన్తారిదానవా) వృత్రా Darkness.

వృత్రః॥పు॥, ధ్వాన్త=చీకటికిని, అరి=శత్రువునకును, దానవాః=వృత్రాసురునికిని పేరు. A foe; a demon.

(బలి హస్తాంశవః) కరాః॥ Ray of light.

కరః ॥పు॥, బలి = అప్పనమునకును, హస్త = చేతికిని, అంశవః=కిరణమునకును పేరు. Hand; tax.

ప్రదరా (భఙ్గ నారీరుగ్బాణా) Excess of menstruation.

ప్రదరః॥పు॥ఇది, భఙ్గ=విఱుచుటకును, నారీరుక్= స్త్రీలయొక్క రక్తస్రావవ్యాధికిని, బాణాః= అమ్మునకును పేరు. Splitting; an arrow.

అస్రాః (కచాఅపి)। Hair; a tear; blood.

అస్రః[స్రా]అస్రః॥పు॥ఇది, కచాః = వెండ్రుకలకును, (అపి) ॥ స ॥ నెత్తురునకును, కన్నీళ్లకును.

(అజాతశృఙ్గో గౌః కాలేఽప్యశ్మశ్రుర్నా చ) తూబరః॥ ౩_౨౦॥

తూబరః॥పు॥ఇది, కాలే=కాలమునందు, అజాతశృఙ్గః=కొమ్ములురాని, గౌః=ఎద్దునకును, అశ్మశ్రుః=గడ్డముమీసమురాని పురుషునికిని పేరు. A hornless bull; a beardless man.

(స్వర్ణేఽపి) రాః property.

రాః॥ఐ,పు॥ ఇది, స్వర్ణే=బంగారునకును, (అపి) పదార్థమునకును పేరు. Gold; wealth.

పరికరః (పర్యఙ్క పరివారయోః)। A bed.

పరికరః॥పు॥, పర్యఙ్క=మంచమునకును, పరివారయోః= పరివారమునకును. A dependent.

(ముక్తాశుద్ధౌ చ) తారః స్యాత్ A star.

తారః॥పు॥, ముక్తాశుద్ధౌ = ముత్యాలశుద్ధికిని, (చ) ॥స్త్రీ॥ నక్షత్రమునకును, కనుగ్రుడ్డునకును,॥త్రి॥గొప్పధ్వనికిని పేరు. Elegance of a pearl; the pupil of the eye; a high note.

శారో (వాయౌ నతు త్రిషు ॥ ౩_౨౧ ॥ కర్బురే)

శారః॥ ఇది, వాయౌ=వాయువునకు పేరయినపుడు॥పు॥, కర్బురే=నానావర్ణములుగలదానికి పేరయినపుడు॥త్రి॥ Air; variegated.

(ధ ప్రతిజ్ఞాఽఽజి సంవిదాపత్సు) సఙ్గరః। Bargain; calamity.

సఙ్గరః॥పు॥ ఇది, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞకును, ఆజిః=యుద్ధమునకును, సంవిత్ = క్రియానిశ్చయమునకును, ఆపత్సు=ఆపదకును పేరు. Promise; war.

(వేదభేదే గుప్తవాదే) మన్త్రః

Secret consultation.

మన్త్రః॥పు॥ ఇది, వేదభేదే=గాయత్ర్యాదివేద మంత్రములకును, గుప్తవాదే= రహస్యాలోచనమునకును పేరు. Prayers of the vedas.

మిత్రో (రవావపి)॥ ౩_౨౨॥

మిత్రః॥పు॥, రవౌ= సూర్యునికిని, (అపి)॥ న॥ చెలికానికినిపేరు. The sun; a friend.

(మఖేషు యూపఖణ్డేఽపి) స్వరు

A piece of sacrificial post.

స్వరుః॥పు॥ఇది, మఖ=యజ్ఞమునకును, ఇషు= బాణమునకును, యూపఖణ్డే= యూపస్తంభము యొక్కతునుకకును, (అపి) వజ్రాయుధమునకును పేరు. A sacrifice; an arrow; thunderbolt.

(గుహ్యే)ప్యవస్కరః।

Excrement;sweepings.

అవస్కరః॥పు॥ఇది, గుహ్యే=స్త్రీపురుషులగుహ్యప్రదేశమునకును, (అపి)మలమునకును, కడవయడుగు అంట్లకును పేరు. Privy part.

ఆడమ్బర(స్తూర్యరవే గజేన్ద్రాణాంచగర్జితే)॥ ౩_౨౩॥

Making a show.

ఆడమ్బరః॥పు॥ఇది, తూర్యరవే = వాద్యధ్వనికిని, గజేన్ద్రాణామ్ = ఏనుఁగులయొక్క, గర్జితే= గర్జించుటకును, (చ) సంరంభమునకును పేరు. Noise of trumpets ; roaring of large elephants.

అభిహారో (ఽభియోగే చ చౌర్యే సన్నహనేఽపి చ)।

Taking arms.

అభిహారః॥పు॥ఇది, అభియోగే= అపకారము చేయుటకొఱకు నెదిరించి యాక్రమించుటకును, చౌర్యే=దొంగిలించుటకును, సన్నహనే=ఆయత్తపడుటకును పేరు. A brisk assault; robbery.

(స్యాజ్జఙ్గమే)పరీవారః (ఖడ్గకోశే పరిచ్ఛదే)॥

An attendant.

పరీవారః॥పు॥ఇది, జఙ్గమే= తిరుగుప్రాణికిని, ఖడ్గకోశే=కత్తియొఱకును, పరిచ్ఛదే=పరిజనమునకును పేరు. A scabbard; the insignia of dignity.

విష్టరో(విటపీదర్భముష్టిః పీఠాద్యమాసనమ్)।

A tree; a stool;

విష్టరః॥పు॥,విటపీ=వృక్షమునకును,దర్భముష్టిః = దర్భపిడికిలికిని, పీఠాద్యం ఆసనమ్=పీఁటమొదలైనయాసనములకును.A handful of sacred grass.

(ద్వారి ద్వాఃస్థే) ప్రతీహారః (ప్రతీహార్యప్యనన్తరే)॥ ౩_౨౪॥

ప్రతీహారః॥పు॥ఇది, ద్వారి=వాకిలికిని, ద్వాఃస్థే=వాకిటికావలివానికిని పేరు. ప్రతిహారీ॥న్॥-అను రూపమును గలదు, A door; a porter. వాకిలిగా

చు స్త్రీకి ప్రతిహారీ॥సీ॥అని పేరు. A female porter.

(విపులేనకులే విష్ణౌ)బభ్రు (ర్నా పిఙ్గలే త్రిషు)।

బభ్రుః॥పు॥,విపులేనకులే=గొప్పముంగిసకును, విష్ణౌ=విష్ణువునకును, ॥త్రి॥ పిఙ్గలే=పచ్చనిదానికిని పేరు. A large ichneumon; Vishnu; tawny.

సారో (బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు)॥ ౩౨౬॥

Marrow.

సారః॥పు॥,బలే=సత్తువకును, స్థిరాంశే=స్థిరాంశమునకును, ॥న॥న్యాయ్యే=యుక్తమునకును, (చ) మెదడుకును, ॥త్రి॥ వరే = శ్రేష్ఠమునకును పేరు. Strength; essence; propriety; excellent.

దురోదరో (ద్యూతకారే పణే ద్యూతే దురోదరమ్)।

దురోదరః॥పు॥, ద్యూతకారే = జూదమాడువానికిని, ॥న॥పణే=పందెమునకును,ద్యూతే=జూదమునకును పేరు. A gamester; gaming; a stake.

(మహారణ్యే దుర్గపథే)కాన్తారం (పున్నపుంసకమ్)॥ ౩౨౭॥

కాన్తారమ్॥పు॥న॥ఇది, మహారణ్యే=దొడ్డయడవికిని, దుర్గపథే=పోవశక్యముకాని త్రోవకును పేరు. A forest; a difficult road.

మత్సరో (ఽన్యశుభద్వేషే తద్వత్కృపణయోస్త్రిషు)।

మత్సరః॥పు॥, అన్యశుభద్వేషే = పరులమేలు చూడఁజాలమికిని, ॥త్రి॥ మత్సరముగలవానికిని, కృపణునికిని పేరు. Envy; niggardly; envious.

(దేవాద్వృతే) వర (శ్శ్రేష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియే)॥ ౩౨౮॥

A little approved.

వరః॥పు॥, దేవాత్ వృతే=దేవతలవలనఁబొందఁబడినయభీష్టమునకును, ॥త్రి॥ శ్రేష్ఠే=శ్రేష్ఠవస్తువునకును,మనాక్ప్రియే=ఇంచుకంతప్రియమయినదానికినిపేరు, అపుడు॥అవ్య॥ A boon; excellent.

(వంశాఙ్కురే)కరీరో (ఽస్త్రీ తరుభేదే ఘటే చ నా)।

కరీరః॥పు॥న॥,వంశాఙ్కురే= వెదురుకొమ్మకును, ॥పు॥తరుభేదే= వెణుతురుచెట్టునకును, ఘటే=కడవకును పేరు. Shoot of a bambu; a jar.

(నా చమూజఘనే హస్తసూత్రే)ప్రతిసరో (ఽస్త్రియామ్)॥ ౩౨౯॥

ప్రతిసరః॥పు॥, చమూజఘనే=సేన వెనుకదిక్కునకును,॥పు॥న॥హస్తసూత్రే = పెండ్లిలోఁగట్టుకంకణదారమునకును పేరు.Rear-guard; a string worn on the wrist at nuptials.

(యమానిలేన్ద్ర చ

హరిః॥పు॥,యమే=యమునికిని, అనిలే=వాయు

ద్రాన్ర్కవిష్ణుసింహాంశు వాజిషు। శుకాహికపిభేకేషు) హరి (ర్నా కపిలే త్రిషు॥ Yama ; wind ; Indra; the moon; the sun; Vishnu; a lion; a parrot; a serpent.

పునకును, ఇన్ద్రే=ఇంద్రునికిని, చన్ద్రే= చంద్రునికిని, అర్క=సూర్యునికిని, విష్ణు=విష్ణువునకును,సింహ=సింహమునకును,అంశు=కిరణమునకును,వాజిషు=గుఱ్ఱమునకును, శుక=చిలుకకును, అహి=పామునకును, కపి=కోఁతికిని, భేకేషు= కప్పకును, ॥త్రి॥ కపిలే=బంగారుచాయ గలదానికిని పేరు. A ray of light; a horse; an ape; a frog; tawny.

శర్కరా(కర్పరాంశేఽపి) Gravel.

శర్కరా ॥సీ॥ ఇది,కర్పరాంశే= పెంచునకును, (అపి) మొరపనేలకును, పంచదారకును పేరు. Soil abounding in stony nodules;candied sugar.

యాత్రా (స్యాద్యాపనే గతౌ)। Livelihood.

యాత్రా॥సీ॥, యాపనే=భోజనము మొదలైన వర్తనలకును, గతౌ = గమనమునకును. Travelling.

ఇరా(భూ వాక్సురా ఽప్సుస్యాత్) Water.

ఇరా॥సీ॥ఇది, భూ=భూమికిని, వాక్=వాక్కునకును, సురా=మద్యమునకును, అప్సు = నీళ్లకును పేరు. The earth; speech; ardent spirit.

తన్ద్రీ ( నిద్రాప్రమీలయోః)॥ Lassitude.

తన్ద్రీ [పా] తన్ద్రా॥సీ॥, నిద్రా=నిద్రకును, ప్రమీలయోః = ఒడలెఱుంగకుండుటకును, Drowsiness.

ధాత్రీ (స్యాదుపమాతాఽపిక్షితి ర ప్యామలక్యపి)।

ధాత్రీ॥సీ॥ఇది, ఉపమాతా=దాదికిని, క్షితిః=భూమికిని, ఆమలకీ = ఉసిరికచెట్టునకును పేరు. A nurse; the earth; an emblic myrobalan.

క్షుద్రా ( వ్యఙ్గానటీవేశ్యా సరఘా కణ్టకారికా॥33_౨॥ త్రిషు క్రూరేఽధమేఽల్పే ఽపి) క్షుద్రం Low; trifling; miserly.

క్షుద్రా ॥సీ॥ వ్యఙ్గా = అంగహీనురాలికిని, నటీ=నాట్యమాడుస్త్రీకిని, వేశ్యా=వేశ్యకును; సరఘా=తేనెటీఁగకును, కణ్టకారికా=వాకుడు చెట్టునకును, ॥త్రి॥ క్రూరే=క్రూరునికిని, అధమే = అధమునికిని, అల్పే=కొంచెమైనదానికిని, (అపి) కృపణునికిని పేరు. A crippled woman; a dancing girl; a whore; a bee; an egg-plant; cruel.

మాత్రా(పరిచ్ఛదే।అల్పే చ పరిమాణేచ)మా

మాత్రా ॥సీ॥,పరిచ్ఛదే = పరివారమునకును, అల్పే=కొంచెమునకును, పరిమాణే = కొలఁదికిని,

త్రం (కార్త్స్న్యే౽వధారణే)॥ 333॥
Half a short syllable.

(చ) అక్షరావయవమునకును, ॥న॥ కార్త్స్న్యే= సకలమునకును, అవధారణే= నిశ్చయమునకును.
Requisites; a little; quantity; the whole; only.

(ఆలేఖ్యాశ్చర్యయోః) శ్చిత్రం wonder.

చిత్రమ్॥న॥, ఆలేఖ్య=చిత్తరువునకును, ఆశ్చర్యయోః=అద్భుతమునకును పేరు. Painting.

కలత్రం (శ్రోణిభార్యయోః)। a wife.

కలత్రమ్॥న॥, శ్రోణి = పిఱుఁదునకును, భార్యయోః= పెండ్లమునకును పేరు. The hip and loins.

(యోగ్యభాజనయోః) పాత్రం
the channel of a river.

పాత్రమ్॥న॥, యోగ్య=యోగ్యునికిని, భాజనయోః=భోజనపాత్రమునకును పేరు. స్రుద్వాదుల రెండుదరులనడిమికిని పేరు. Capable; a vessel.

పత్త్రం (వాహనపక్షయోః)॥ 334॥

పత్త్రమ్॥న॥ఇది, వాహన=వాహనమునకును, పక్షయోః=ఱెక్కకును పేరు. A vehicle; a wing.

(నిదేశగ్రన్థయోః) శ్శాస్త్రం

శాస్త్రమ్॥న॥ఇది, నిదేశ = ఆజ్ఞకును, గ్రన్థయోః = వ్యాకరణాది గ్రంథములకును పేరు.
Command; institutes of a science.

శస్త్ర (మాయుధలోహయోః)। iron.

శస్త్రమ్॥న॥ఇది, ఆయుధ=ఆయుధమునకును, లోహయోః=లోహమునకును పేరు. A weapon.

(స్యాజ్జటాంశుకయోః) ర్నేత్రం
An eye.

నేత్రమ్॥న॥ఇది, జటా = చెట్టువేరునకును, అంశుకయోః=తెలిపట్టు చీరకును పేరు. ఇదిగాక కవ్వపుత్రాటికిని, కంటికిని పేరు. Root of a tree; the rope of a churn; wove silk bleached.

క్షేత్రం (పత్నీశరీరయోః)॥ 335॥
A field; a holy spot.

క్షేత్రమ్॥న॥ఇది, పత్నీ = పెండ్లమునకును, శరీరయోః= దేహమునకును పేరు. ఇదిగాక మడికిని, సిద్ధస్థానమునకును పేరు. A wife; body.

(ముఖాగ్రే క్రోడహలయోః) పోత్రం

పోత్రమ్ ॥న॥ ఇది, క్రోడహలయోః ముఖాగ్రే= పందిమూతికిని నాఁగేటికొనకును పేరు. Snout of a hog; fore-part of a plough.

గోత్రం (తు నామ్ని చ)।

గోత్రమ్॥న॥, నామ్ని = నామధేయమునకును, (చ)కులమునకును, ద్రవ్యమునకును,॥ పు॥ పర్వత

Mountain; the earth; a herd of kine.

మునకును, ॥స్త్రీ॥ భూమికిని, గోసమూహామునకును పేరు. Name; family, race; wealth.

సత్త్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేఽపి చ॥ Scrifice; liberality; a forest; fraud.

సత్త్రమ్॥న॥ఇది, ఆచ్ఛాదనే = గృహామునకును, యజ్ఞే = యజ్ఞవిశేషమునకును, సదాదానే = ఎడతెగని యీవికిని, వనే చ=వనమునకును,(అపి) డంభమునకును పేరు. A house; covering.

అజిరం(విషయే కాయే ప్య

Wind.

అజిరమ్॥న॥, విషయే=శబ్దాదివిషయములకును, కాయే=శరీరమునకును,(అపి)ముంగిలికిని, వాయువుకును.Object of perception;body; a court-yard.

మ్బరం(వ్యోమ్ని వాససి)। Apparel.

అమ్బరమ్॥న॥ ఇది, వ్యోమ్ని=ఆకాశమునకును, వాససి=వస్త్రమునకును పేరు. The sky.

చక్రం (రాష్ట్రే ఽప్యశ్రి)

A potter's wheel; a sharp discus; a ruddy goose; multitude.

చక్రమ్॥న॥,రాష్ట్రే = దేశమునకును, (అపి) సైన్యమునకును, బండికంటికిని, సుడిగుండమునకును, కుమ్మరసానకును, అయుధవిశేషమునకును, ॥పు॥ చక్రవాకపక్షికిని, సమూహామునకును పేరు. Realm; an army; wheel; whirlpool.

క్షరం (తు మోక్షేఽపి)

a letter.

అక్షరమ్॥న॥ఇది, మోక్షే=మోక్షమునకును, (అపి) అకారాది వర్ణములకును, పరబ్రహ్మకును పేరు. The final beatitude; the supreme soul.

క్షీర(మప్సు చ)॥332॥

క్షీరమ్॥న॥ ఇది, అప్సు=నీళ్లకును, (చ) పాలకును పేరు. Water; milk.

(స్వర్ణేఽపి) భూరి చన్ద్రౌ (ద్వౌ)

camphor; water.

భూరి॥న॥,స్వర్ణే=బంగారమునకును,(అపి)॥త్రి॥ బహుళమునకుపేరు. Gold; numerous. చన్ద్రః॥పు॥, బంగారమునకును, (అపి) చంద్రునికిని,కర్పూరమునకును, జలమునకును పేరు. Gold; moon.

(ద్వారమాత్రే ఽపి) గోపురమ్।

Cyperus grass.

గోపురమ్॥న॥ఇది, ద్వారమాత్రే=వాకిలిమాత్రమునకును, (అపి) పట్టణపువాకిటికిని, తుంగముస్తలకును పేరు. Door; a town gate.

(గుహాదమ్భౌ) గహ్వ

గహ్వరమ్॥న॥, గుహా = గుహకును, దమ్భౌ=

రే ద్వే | కపటమునకును పేరు. A cavern; pride, fraud.

(రహో౽న్తికముప
హ్వరే॥ 33౯॥ Near.

ఉపహ్వరమ్॥న॥ ఇది, రహః=ఏకాంతమునకు
ను, అన్తికమ్=సమీపమునకును పేరు. Solitude.

(పురో౽ధిక ముప)
ర్యగ్రా
Extremity; chief; four
mouthfuls; much.

అగ్రమ్॥ఇది, పురః=ముందరికిని, అధికమ్=అ
ధికమునకును, ఉపరి=మీఁదికిని పేరు. ఇదిగాక ॥త్రి॥
ప్రధానమునకును, ॥న॥ గ్రాసచతుష్టయ ప్రమాణ
మయినభిక్షకును, కొనకును పేరు. Front; top.

(గృహాగారే నగరే) పు
రమ్। మన్దిరంచా

పురమ్-మన్దిరమ్॥ న॥ ఈ రెండును, అగారే=ఇం
టికిని, పట్టణమునకును పేరు. A house; a town.

రాష్ట్రో (౽స్త్రీ విష
యే స్యాదుపద్రవే)॥

రాష్ట్రః॥ పు॥ఇది, విషయే=దేశమునకును, ఉ
పద్రవే=ఉపద్రవమునకును పేరు. Country; calamity.

దరో (౽స్త్రీ యాంభ
యే శ్వభ్రే)
A little.

దరః॥ పు॥ఇది, భయే=భయమునకును, శ్వభ్రే=
గుంటకును పేరు. ఇదిగాక కొంచెమనెడు అర్థ
మునందు॥అ॥. Fear; a hole in the ground.

వజ్రో (౽స్త్రీ హీరకే
పవౌ)॥ Thunderbolt.

వజ్రః॥ పు॥ హీరకే=వజ్రమనురత్నమునకును,
పవౌ=వజ్రాయుధమునకును. Diamond.

తన్త్రం (ప్రధానే సి
ద్ధాన్తే సూత్రవాయే పరి
చ్ఛదే)॥ 3౪0॥
Dependants.

తన్త్రమ్॥న॥ఇది, ప్రధానే=ప్రధానమునకిని, సిద్ధా
న్తే=సిద్ధాంతమునకును, సూత్రవాయే=నేయుట
కును, పరిచ్ఛదే = పరివారమునకును పేరు.
Chief; right conclusion; a weaver's batten.

ఔశీర (శ్చామరే దణ్డే)
౽ప్యౌశీరం (శయనా
సనే)।
Fragrant root of grass;
a fan.

ఔశీరః॥పు॥, చామరే=చామరమునకును, ద
ణ్డే = యష్టికిని,॥ న॥ శయన = శయనమునకును,
ఆసనే=పీఠమునకును, శయనమునుఁగా నిప్రియని
కొందఱు. (అపి)॥ త్రి॥ వట్టివేళ్ల సంబంధమగుదానికి
ని పేరు. The handle of a fan; a bed; a stool.

పుష్కరం (కరిహస్తా
గ్రే వాద్యభాణ్డముఖే జ
లే॥3౪౧॥ వ్యోమ్ని ఖడ్గ
ఫలే పద్మే తీర్థౌషధివిశే

పుష్కరమ్॥న॥ ఇది, కరిహస్తాగ్రే=ఏనుఁగుతొం
డముకొనకును, వాద్యభాణ్డముఖే = మద్దెల మొద
లైన వాద్యములముఖమునకును, జలే=నీళ్లకును,
వ్యోమ్ని=ఆకాశమునకును, ఖడ్గఫలే=కత్తివాదర

షయోః)।

Head of a drum; edge of a scimitar.

కును, పద్మ=కమలమునకును, తీర్థ=తీర్థవిశేషమునకును, ఓషధివిశేషయోః = ఓషధివిశేషమునకును పేరు. Tip of an elephant's trunk; a lotus; a drug; name of a continent; water; sky.

అన్తర (మవకాశావధి పరిధానాన్తర్ధి భేద తాదర్థ్యే॥ ౨౮౨॥ ఛిద్రాత్మీయ వినా బహిరవసర మధ్యేఽన్తరాత్మని చ।

Difference; sake; a hole; own; except; outside; opportune time; midst; supreme soul;

అన్తరమ్॥న॥ఇది, అవకాశ=ఎడమునకును, అవధి=మర్యాదకును, పరిధాన = కట్టుకోకకును, అన్తర్ధి=వ్యవధానమునకును, భేద=విశేషమునకును, తాదర్థ్యే=దానికొఱకిదియను నర్థమునకును, ఛిద్ర=రంధ్రమునకును, ఆత్మీయ=తనసంబంధమైన దానికిని, వినా=అది వెలిగానను వినార్థమునకును, బహిః=వెలుపలికిని, అవసర=అవసరమునకును, మధ్యే=మధ్యప్రదేశమునకును, అన్తరాత్మని = పరమాత్మకును, (చ) అన్యమైన దానికిని పేరు. Interval; period; clothing; another; inside.

(ముస్తేఽపి)పిఠరం

పిఠరమ్॥న॥ఇది, ముస్తే= తుంగముస్తలకును, (అపి)కుండకును,కవ్వపుకోలకును పేరు. A churning stick; a vessel; Cyperus rotundus.

(రాజకశేరుణ్యపి) నాగరమ్॥ ౨౮౩॥

Belonging to a city.

నాగరమ్॥న॥ఇది,రాజకశేరుణి=భద్రముస్తలకును,(అపి)సొంటికిని, నగరసంబంధమయిన దానికి పేరయినపుడు॥త్రి॥. Cyperus pertenuis; ginger.

శార్వరం(త్వన్ధతమసే ఘాతుకే భేద్యలిఙ్గకమ్)।

Destructive.

శార్వరమ్॥ఇది, అన్ధతమసే=ఘనమయిన చీకటికి పేరయినపుడు॥న॥,ఘాతుకే=చంపుస్వభావము గలదానికి పేరయినపుడు॥త్రి॥. Very dark.

గౌరోఽ (రుణే సితే పీతే)

గౌరః॥త్రి॥ఇది, అరుణే=ఎఱుపువస్తువునకును, సితే=తెలుపువస్తువునకును, పీతే=పచ్చనివస్తువునకును పేరు. Pale red; white; yellow.

(వ్రణకార్యప్య)రుష్కరః॥ ౨౮౪॥

Corrosive.

అరుష్కరః॥త్రి॥ఇది, వ్రణకార=వ్రణమును చేయుదాని పేరు. అపిశబ్దమువలన జీడిచెట్టునకు పేరయినపుడు॥పు॥. Semicarpus Anacardium.

